మంజీర కవుల **ఎడపాయలు**

అలాజిపూర్ కిషన్
దేశపతి శ్రీనివాస్
ఏలేశ్వర నాగభూషణాచార్య
దాసరాజు రామారావు
పప్పుల రాజిరెడ్డి
ఐలేని గిరి
కందుకూరి శ్రీరాములు
మహమూద్ పాషా
నందిని సిధారెడ్డి
కె. అంజయ్య
వేముగంటి మురళి
తైదల అంజయ్య
యం.డి. అహ్మద్
కె. రంగాచారి
మోతుకూరి అశోక్ కుమార్
పోగుల రాజన్న

# మంజీర కవుల
# ఎడపాయలు

**YEDAPAYALU**
Anthology of Poetry
by **Manjira Poets**

Manjeera Rachayithala Sangham
15th Annual Function, Siddipeta
October 13 & 14, 2001

Cover Painting
**K. Rajaiah**

Cover Design
**Seela Veerraju**

Publication
**Manjeera Rachayithala Sangham**
17-112, Thoombai, Srinagar Colony,
Siddipeta - 502 103. Ph. : 08457-24877

For Copies
**Visalandhra Book House** , Bank Street, Hyderabad and its branches in A.P.
**Prajasakthi Book House,** Chikkadpally, Hyderabad and its branches in A.P.
**Disa Pustaka Kendram;** Chikkadpally, Hyderabad - 20.
**Navodaya Book House,** Opp. Arya Samaj Mandir, Kachiguda, Hyderabad.

Composed at
**Media Graphics,** Himayathnagar, Hyd. Ph. : 6596509

Printed at
**Charitha Graphics,** Chikkadpally, Hyd. Ph. : 7607361

Rs. **35.**

నిరంతర చరిత్రయి వికసిస్తున్న
తెలం'గాన' తానమాడిన

**కవులకు**
**కళాకారులకు**
**వీరులకు**

# ఎడపాయల మునుం

*

# పదిహేనేళ్ళ దీర్ఘకవిత

## కె. శివారెడ్డి

'The longer I live, the more I rebel'

'Zorba The Greek', Nikos Kazantzakis

నిన్నగాక మొన్న జరిగినట్టు వుంది. ఒక పదిహేను సంవత్సరాల క్రితం మెదక్‌లో 'మెదక్ స్టడీ సర్కిల్' ప్రారంభించబడి, అదే క్రమంగా మంజీరా రచయితల సంఘంగా రూపు దిద్దుకొని, ఎదుగుతూ, విస్తృతి చెందుతూ, విశాలమౌతూ ఒక చారిత్రిక బాధ్యతని నిర్వహిస్తూ వస్తూ వుంది. గత దశాబ్దంన్నరగా ఎన్నెన్ని సమావేశాలు, సాహిత్య సమావేశాలు, సామాజిక కార్యక్రమాలు. క్రమక్రమంగా అది మెదక్‌జిల్లా ప్రజల సాంస్కృతిక, సామాజిక, రాజకీయ జీవితానికి ప్రతిరూపమయ్యింది. అది నిర్వహించిన, నిర్వహిస్తున్న పాత్ర గణనీయమైంది, గుణాత్మకమైంది. 'ప్రతి రచనా ఒక రాజకీయ కార్యాచరణ' అన్నదానికి అది అద్దం పట్టింది. పేరుకు మాత్రమే అది మంజీరా రచయితల సంఘం - మెదక్ జిల్లా రచయితల సంఘం - కానీ ఒక్క మెదక్ జిల్లాలోనే కాదు భారతదేశంలోనే గాదు ప్రపంచవ్యాప్తంగా వచ్చిన అనేక మార్పులను వాటి ప్రభావాల్ని, పర్యవసానాల్ని అది రికార్డు చేసింది.

భారతీయ సామాజిక సాంస్కృతిక జీవిత చిత్రణే కాదు ప్రపంచవ్యాప్తంగా మనిషి ఆవేదననీ, ఆక్రోశాన్నీ, ఆశయాన్నీ కూడా అది రికార్డు చేసింది. పేరుకు మాత్రమే ఒక ప్రాంతీయ సంస్థ. విధి నిర్వహణలో, కార్యాచరణలో, సాహిత్య సృజనలో అది ప్రాంతీయ తల్లి అధిగమించింది. నిర్దిష్టమౌతూనే సాధారణీకరణ చెందింది. మనిషి భౌతిక ఆంతరిక జీవితానికది అద్దం పట్టింది.

గత పదిహేనేళ్ళుగా తెలుగునాట వర్ధిల్లిన, వర్ధిల్లుతున్న అనేక ఉద్యమాలకి అది బాసటగా నిలచింది. ఆ ఉద్యమాల మూలసారాన్ని ఆత్మీకరించుకుంది. మట్టి మనిషికీ, పోరాటశక్తికీ అది మారుపేరయ్యింది. భూపోరాటాలు గావచ్చు, సారా వ్యతిరేక ఉద్యమం గావచ్చు. తెలుగునాట తగిలిన ప్రతి దెబ్బకీ అది ఆర్తించింది. ప్రతి మలుపు లోనూ, ప్రతి ప్రధాన ఘటనవద్దా అదే వుంది. పదిహేనేళ్ళు ఎంత తొందరగా జరిగి పోయాయి. ఎంత పోరాటం, ఎన్ని మరణాలు, ఎంత రక్తం గారింది. ముఖ్యంగా తెలం గాణా ప్రాంతంలో సాకారం బొందిన చైతన్యంలో దాని వంతు తక్కువయిందేమీ గాదు.

అది చేసిన పోరాటాలకీ, ఉద్యమాలకీ సాధించిన విజయాలకీ, నేను సాక్షీభూతుణ్ణి. నా చలనశీల సృజనాత్మక జీవన వాతావరణంలో అదెక్కువ భాగం ఆక్రమించుకుంది. మంజీరా రచయితల సంఘం, దాని సభ్యులూ, మిత్రులూ, సానుభూతిపరులూ, అదృశ్య సహాయకారులూ - అందర్నీ తీసేస్తే నాలో చాలాభాగం ఖాళీగా వుండిపోతుంది. పెద్ద పూడ్చలేని అఖాతం ఏర్పడుతుంది. నిజానికి మంజీరా రచయితల సంఘం చరిత్ర రాయాల్సి వస్తే చాలా రాయాల్సి వుంటుంది. గత పదిహేనేళ్ళ తెలంగాణాకి అది సాక్షీభూతం. ఒక సాంద్ర నిదర్శనం. ఒక సుదీర్ఘ కవిత.

ఒక జాతి సాంస్కృతిక జీవితంలో రచయితల కవుల, కళాకారుల పాత్ర బహుశ ప్రత్యామ్నాయం లేనిది.

మంజీరా రచయితల సంఘం ఏర్పడేనాటికే కవులుగా ప్రసిద్ధులవుతూ వున్న వాళ్ళూ వున్నారు. మంజీరా రచయితల సంఘం ఏర్పడ్డాక కవులుగా జన్మించినవాళ్ళూ, గాయకులుగా జన్మించిన వాళ్ళూ, సాహిత్యోద్యమ కార్యకర్తలుగా రూపుదిద్దుకున్న వాళ్ళూ గణనీయ సంఖ్యలోనే వున్నారు. నిర్బంధాన్నీ చవిచూచినవాళ్ళూ ఉన్నారు. మట్టికీ, మనిషికీ ఉన్న ఒక అసామాన్య అవిచ్ఛిన్న సంబంధాన్ని పసిగట్టి భూపోరాటాల్ని సాహిత్య పోరాటా లుగా మలచినవాళ్ళూ వున్నారు.

ఈ పదిహేనేళ్ళలో జన్మించి, వికసించి రాటుదేలిన పదహారుమంది కవుల స్వర పేటిక యిది. ఈ పదిహేనేళ్ళలో జరిగిన అన్ని ప్రధాన ఘటనల వద్దా సందర్భాల వద్దా, సంక్షుభితమైన జాతీయ అంతర్జాతీయ మానవుని 'వ్యస్తిత్వ' వేదన వద్దా వీళ్ళు వున్నారు. వీళ్ళు ప్రతి స్పందించకుండా వున్న ఘటన ఏదీలేదు. ప్రాంతీయ వాస్తవికత నుంచి అంతర్జాతీయ వాస్తవికత దాకా విస్తరించిపోయారు.

వ్యక్తిత్వ విధ్వంసం, రాజ్యహింస, మనుషుల మధ్య దూరం, రైతుల ఆత్మహత్యలు ప్రాంతీయ అసమానతలూ సరళీకృత ఆర్థిక విధానాల పర్యవసానాలు సామ్రాజ్యవాద సాంస్కృతిక దాడీ - ఒకటేమిటి అన్నీ విలువల పతనాల మూలకారణాల అన్వేషణలు న్నాయి. మనిషి పరాయి అవ్వటం మనిషి తనకు తను పరాయి అవ్వటం - మానవ సంబంధాలు ఆర్థిక సంబంధావ్వటం - మనిషి తడారిపోవటం - అన్నీ - పర్యావరణం నుంచి ప్రపంచీకరణ దాకా- అన్నీ అనుభవంలోకి వస్తాయి.

ఉదాహరణివ్వటంలేదు. నిజానికి ఈ పదహారుమంది కవుల సర్వస్వం యిది కాదు. ఒక మాసరా మాత్రమే యిది. రేఖాచిత్రం మాత్రమే. ఒక పదహారుమంది కవుల ఎన్నుకున్న కవితల్ని సంపుటీకరించేటప్పుడు - పదిహేనేళ్ళ వ్యవధిలో - ఎదురయ్యే సమస్యని సంపుటీకర్తలు జాగ్రత్తగానే పరిష్కరించినట్టు కవితలు చదివితే అర్థమౌతుంది. ఒక పుస్తకం వేసినవాళ్ళూ వున్నారు. నాలుగు పుస్తకాలు వేసినవాళ్ళూ ఉన్నారు. యింకా పుస్తకం తేని వాళ్ళూ ఉన్నారు. అయితే కవితల్ని ఎన్నుకునే క్రమంలో ఈ పదిహేనేళ్ళ చారిత్రక ప్రాధాన్యతని దృష్టిలో పెట్టుకునే ఎన్నుకున్నారనీ అర్థమౌతుంది. ఆయా కవుల పేర్లు తీసేసి కవితల శీర్షికలు తీసేసి అచ్చేస్తే యిదొక కావ్యం అవుతుంది. మరో తెలంగాణా మహత్తర కావ్యమౌతుంది.

వారివారి సాధననిబట్టీ, అనుభవ అధ్యయనాన్ని బట్టీ కవితలు రూపుదిద్దు కున్నాయి. కేంద్రస్థానంలో వున్న ఒక వ్యక్తిగావచ్చు, లేదు ఒక సంస్థగావచ్చు - అది కళ జన్మించటానికి కావలసిన భౌతిక వాతావరణం ఏర్పరచుతుంది. ఆ ఆవరణ నుంచి కళానుభవ ఆవరణలోకి కవీ, అతనితోపాటు కవితా ప్రయాణిస్తుంది. మన అనుభవాన్ని పరానుభవంగా పర్యవసింపజేసేదిదే. ఆ పనిని మంజీరా రచయితల సంఘం దిగ్విజయంగా నెరవేర్చిందని చెప్పటానికి ఈ సంపుటి ఒక ఉదాహరణ మాత్రమే.

నిర్దిష్ట ఘటనానుభవంలోకి అంతర్జాతీయ ఘటనానుభవం బొట్టుబొట్లుగా దిగు తుంది. అలాగే ఒక అంతర్జాతీయ సందర్భానుభవసారంలోకి ప్రాంతీయానుభవ సారమూ వొలుకుతుంది.

"I sing a common thought that joins us in the dark and golden hours"

- Lorca

10-10-2001 • హైదరాబాద్.



# గోస

అలాజిపూర్ కిషన్

నోర్లేన్దాన్ని
మీ బిడ్డసుంటి దాన్ని
నన్నమ్ముకుంటరా కోత కమ్ముకుంటరా
మీ కడ్పుల పుట్టకున్నా మీ ఇంటిదాన్ని
నన్ను మిషనుగ్గొడ్తరా ?
మీ పిల్లల్ని గంత గాబ్రంగ పెంచుకోవడ్తిరి
నాకు పిడికెడు గడ్డేసి సాదరా ?

బాటెర్కలే బరువెర్కలే
కరువెర్కలే కష్టమెర్కలే
నేనెండి మీకు బువ్వపెడ్తి
పానమవిసిపోయినా పాలిస్తి
మీ ఇంట్ల అల్కైతి
వాకిట్ల సాన్పైతి పాయిల పిడ్కైతి
ఆకర్కు మీ కాల్ల చెప్పైతి
ఇంటి ముంగట పూజల్జేసి
ఇంటెన్క కట్టిగ్గెటట్టు గొడ్తిరి
నోర్లేన్దాన్ని గదా
మోట గొడ్తి, ఇరువాల్లు నాగల్దున్తి
దంతె గొడ్తి గొర్రుగొడ్తి
నా రక్తం ఇత్తాయే మొల్కాయే
బంతిదొక్తె మీ ఇంట్ల పంటాయే
రాసులువోసి దొర జేబుల్నింపితి
గ్యానం లేన్దాన్ని గదా బాంచెన్
నన్నాగం జేస్తరా ?

శేరుగొడ్తిరి
కాల్లకు ఇనుప నాడాలు గొడ్తిరి
దుంకకుండా మెడల మొద్దుగడ్తిరి
మెయ్యకుండ మూతికి బుట్టవెడ్తిరి
మెసులరాని బతుకు జేస్తిరి
ఐనా మీ బతుక్కోసమే బతికిన
గీ బత్కుగూడ బత్కనియ్యరా
కరువొచ్చిన్నాడు
గడ్డిగావాలన్నా సొప్ప గావాలన్నా
తౌడంటినా పిండంటినా
ఎంగిలేసి గంజివోసిన కుడ్డి దాగిన
మీగ్గీకుడ్డి గుడ బరువాయెనా
ఈనెతందుకొస్తే పెద్దరోగమొస్తే
నామొస్తె పాముగుడ్తె మందా? మాకా?
మీ అడ్వీల్లసుంటిదాన్ని
కొత కమ్ముకుంటరా ?

దొర్సాని కచ్ర మెక్కితే
ఇర్వైయామల్లు ఇర్సేలె దిర్గిన
జీతగాడు వార్గట్టె తోటి గొడ్తె
ముడ్డంత నెత్తురాయె
బీట్ల వొడ్లు మోస్తి గిర్నిల బియ్యమోస్తి
బస్తిల పెద్దపెద్ద బరువులు మోస్తి
గాండ్లోల్లింట్ల గానుగై దిర్గితి
బండెడు బరువైనబతుకు మీగ్గుడ బరువాయెనా ?
మీ కొట్టంల పుట్టిన్నాన్ని
మీ కొట్టంలనే సావనియ్యంర్రి
మీ గుడ్డమ్లనే బొందపెట్టుంర్రి
నోర్లేన్దాన్ని
మీరు నరకాన వడొద్దని
దానమిచ్చిన్నాడు
అంబా అంటున్న ల్యాగనిడిసి
నరకాన పడ్డదాన్ని



అడ్వీల పులి ఆకలై ఒక్కసారే
సంప్కదింటది
కబేలల తోలుబ్బ గొట్టి
మిషిన్ల వెట్టి
మెడగోసి కాల్లునర్కి కైమజేసి
బర్ఫ్‌డబ్బాల పెట్టి అమ్ముతరు
నన్ను గంత గోస వెడ్తరా బతుకు ఆగం జేస్తరా

మీ జీవివాయెటప్పుడు
నోట్లజీవగంజైనదాన్ని
నా జీవం తీస్తరా ?
లోకాన్కి భిక్ష పెట్టిన్దాన్ని
మీ ఇంటి ముంగిట్కి భిక్షానికొచ్చిన
నాకు పానం భిక్ష పెట్టుండి.

# నా తెలంగాణా

దాసరాజు రామారావు

ఎక్కుపెట్టిన వెయ్యిన్నొక్క తుపాకీ మోతల
మధ్యన,
ఎండిపోయిన బీడు బతుకుల పాల్లు కాలాల
మధ్యన,
తొమ్మిది జిల్లాల మోసపోయిన తలరాతల
తెలంగాణని దర్శిస్తున్నా !

కావలించుకొని కన్నీరు తుడుస్తున్న
చెయ్యే అంతటా -

రెండు చేతులతో బొచ్చె
గుద్దుకునే ఆర్తి -
పోలీస్ రచనా వ్యూహాల నెత్తుటి జల్లెడ లైన
పల్లెల కథలు -

కోటి రతనాలను కొల్లగొట్టి
మోడువీణను చేసిన ఆంధ్రా వుషారు -

ఎన్ని గోసలెన్నిగోసలెన్ని గోసలు
విషపు రంగుల్లా చిమ్మబడి
నా తెలంగాణా అపురూప చిత్రపటాన్ని
నాకు కాకుండా చేస్తున్నాయి ?
పల్లె ముఖాన్ని ఒళ్ళోకి తీసుకొని
పసికూనలా ముద్దాడిన రోజులేవీ?
దండకారుణ్యంలో అడవి తల్లి సింగారాల
స్వేచ్ఛాగాన మయూర నృత్యాలెటు పోయినాయి ?



ఆడతల్లుల మొహాన
పూరి పెద్ద చెరువంత బొట్టులా మెరిసిన
నా తెలంగాణ ఏమైపోయినాది ?

మాట్లాడండి! మాట్లాడండి!!
నోళ్ళు మూసుకొని
పెద్ద మనుషుల ఒప్పందంలో పాతేసిన
మీ అంతరాత్మల్ని బద్దలు కొట్టుకొని
మరీ మాట్లాడండి !
చంపిన వీరుని పక్కన తుపాకి పెట్టి
ఫోటో తీసినంత సహజంగా
మాట్లాడండి!!
చిగురించే కల లాంటి తెలంగాణని
కల్లోలితను చేసి
పహరా కాస్తున్నారు
పంట వాసనేసే మాగాణి తెలంగాణలో
ఫ్యాక్టరీ భూతాలను దించి
విషవాయువు కోరలను సాచుతున్నారు
దగాచేసి తెలంగాణను
దయనీయంగా మార్చినారు
పాలేరు నుంచి కూలి బతుక్కి
పైసల ముగుదాడేసి దిగలాగినారు

ఇంకా ఏముంది తెలంగాణాలో ?
మా తెలుపుల్ని తెలివి తక్కువ చేసి మాట్లాడే
మీ యాస తెలుపులు
పాడుగాను !

అంగళ్ళు పెట్టి ఆగమాగం చేసిన తెలంగాణా
కంపిన్లు పెట్టి గావరగావర చేసిన తెలంగాణా

ఇప్పుడు

కొత్తబాణీలో పాటను
సిద్ధం చేసుకోటానికి
అక్షరాలను సమకూర్చుకొంటోంది !

మే - ఆగష్టు 1998

# ఏడ్వడం అవసరమే

ఐలేని గిరి

ఏడ్వడం అవసరమే –
అన్నింటికీ నవ్వేవాడు కొన్నింటిని పట్టించుకోనట్టే లెక్క
బాధను దిగమింగుకోవడం అంత ఆరోగ్యకరం కాదు

బాధ ఎండిపోయిన చేనులా
చేతికందని పంటలా
పనిచేయని పురుగు మందులా
ఎదగని పైరులా – గిట్టుబాటుకాని ధరలా
అప్పుల అష్టదిగ్బంధనంలా
అశనిపాతంలా వుంటుంది

వరికంకులు తలలు వాల్చినపుడు
ఏడ్పు తన్నుకు రాకుండా ఎలా వుంటుంది !
ఏడ్వడం అవసరమే –

కొనబోతే కొరివై అమ్మబోతే అడివై
ఏది ముట్టినా కరెంటుషాక్ తిన్నవాడు
బాధ పడకుండా ఎలా వుండగలడు ?

జీవితం విలువల్ని కోల్పోయి
మార్కెట్ మాయాజాలంలో చిక్కాక
నన్ను నా నుంచి దూరం చేసి
కంప్యూటర్‌కో కలర్ టీవీకో బంధించాక
కోల్పోయిన మనిషితనం కోసం
ఏడ్వకుండా ఎలా వుండగలం !



అసలు ఏడ్వడమంటేనే మనిషితనం
అన్నింటికీ నవ్వేవాడు – బాధల్ని దిగమింగుకునేవాడు
ప్రమాదాన్ని మోస్తున్నట్టే లెఖ్ఖ
సంతోషాన్ని వ్యక్తం చేసుకున్నట్టే
బాధల్నీ, భయాల్నీ, భ్రమల్నీ వ్యక్తం చేసుకుంటేనే కదా
జీవితం విశాలమయ్యేదీ...

మనుషుల్ని ఇరుకు సందుల్లోకి నెట్టి – ఒంటరిచేసి
అదే ప్రపంచమని భ్రమింపజేయడం ఎంత బాధాకరం !
బతుకుని ఒంటరి ఒంటె కాళ్ళతో ఈడ్చుకుంటూ వెళ్ళడం దుఃఖకరమే
ఏడ్వడం అవసరమే –
ఏడ్చీ ఏడ్చీ కళ్ళలో నీళ్ళింకినపుడే – మనసు దృఢ పడుతుంది
ఒక్కడిగా ఏడిస్తే ఏం లాభం !
ఏడుపు నాలుగ్గోడల మధ్య నీ చుట్టే తిరిగి నిన్నే కబళిస్తుంది
ఏడ్వడం ఎంత ముఖ్యమో
సామూహికంగా ఏడ్వడం అంతే ముఖ్యం
అందరి ఏడ్పుకూ మూలం ఒక్కటే అయినపుడు
ఏడ్పుకి పరిష్కారాన్ని సమూహమే నిర్ణయిస్తుంది

# దప్పుహక్కు

**ఏలేశ్వర నాగభూషణాచార్య**

మాదిగ మాలలు అంటరానివారని ఊరునుండి
అమాయకపు బలిపశువుల్ని తరిమినట్లు
మమ్మల్ని తరిమినప్పుడే గదా...?!
ఊరు శివారులో మా బతుకు కలుపుమొక్కలను నాటేసుకున్నది
మా సంతులోనే ఓ వృక్షం ఆకాశానికెగసినప్పుడు
సరిపడని హస్తాలేగదా.... మా చెప్పుల్నే వృక్షం కంఠాన
మాలగా ధరింపజేసినవి
దళితులమైనంత మాత్రాన దగాకోరులం కాదు బాబు
ఆకటి కేకల్లో సైతం చితికిపోయిన పేగులకు
చీకట్ని దారంగా వడికి ముడేసుకుంటాం
మేమూ మనుష్యులమే...
సంద్రమంత మనస్సున్నవాళ్ళం
మీ సంబరాల పెళ్ళి పేరంటాల ముందు
మా గూడుగట్టిన ఎముకల దిండుకు
చర్మాన్ని విదిలిస్తూ దప్పుముడి బిగించి
చీలమండనెటికలతో దప్పుమీద దెబ్బానినపుడే...
మీరు పుస్తెల్ని గట్టుకునేది పూలు బుక్కాలు చల్లుకునేది
మీరు ఎంఎల్ఏలై మంత్రులై ఊరు బయట బసజేసిన వేళ
ఊరేగింపుగా మీ ముందు గుణగుణా నడిచేవి మాదప్పులేగా...
మీరు జాతర్లు జేసుకున్నపుడు మీ బండ్ల భోనాల ముందు
సయ్యాటలాడేది మా దప్పులేగదా...
మా కంపుగాలి మీపై వీచకుండా ఛీకొట్టి
ఎంత వెనక్కి వుంచారో



మీ అవసరాల బాలింతతనానికి
అంత ముందుకుంచుకుంటున్నారు
వెలుతురు ఖడ్గం రివ్వున దూసుకొచ్చినపుడు
మీ కళ్ళు కటికచీకటి బురఖాల్లో మూతలేసుకుంటాయ్
స్వర్గంగతో పునీతమౌతున్న ఆలోచనల్లారా...
మమ్మల్ని ఇప్పటికైనా ఆనవాల్లు పట్టారా...
మీ శవాలముదు దుఃఖాన్ని మాన్పించటానికి
పాడెముందు మా దప్పు దండోరా పిటాయిస్తూ
కాడులో పెట్టేవరకు మాదప్పుమోత ఆగదని తెలుసు
కరడుగట్టిన గుండెలన్నీ పల్చపల్చని నీళ్ళయ్యేదాక
మా దప్పుధ్వని ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది
మా దప్పుల ధ్వనిలోనే అడవులన్నీ ఆలింగనం
జేసుకుంటాయి

16-9-1990

# నాతల్లి తెలంగాణా

తైదల అంజయ్య

ప్రమాదాల శైశవదశను
చిటికెన వేలుపట్టి నడిపించిన నడక
కాలుతున్న ఉశికెలో
అక్షర తూణీరాలను మోస్తున్నప్పుడు
లేలేత పాదాలకు తొడిగిన
మోదుగాకు చెప్పులు
గొంతెండిపోయి అలమటించినప్పుడు
చల్లగా ఎదురొచ్చిన నీటిచెలిమె
కోడిగూసేయాల్లకు
దీపం ముందు చదువుకున్న పాఠం
మట్టిగోడ మీద
గీసిన చిలుకబొమ్మ
అప్పుదీర్చేతందుకు
ఉన్న ఊరిడిచి వెళ్ళిన వలస బతుకులు
ఆకలితో తిన్న కారం మెతుకులు
వడ్లుదంచిన దొరగడీలల్ల
తిరగబడ్డ రోకండ్లు
నైజాం నఖాల మెడవంచిన వీరగాథలు
అమ్మా !
ఇవి నా అమర స్మృతులు
మసకబారిన చూపులతో
నుదుటిమీద అరచేతి నుంచి
నువ్ చూస్తున్నప్పుడు



నేను రంగురంగుల సీతాకోకచిలుకలను
అలుపెరుగకుండా వెంటాడుతాను
వర్షం వెలిసిన తర్వాత
ఉశికెలో నీ పాదాలకు
చల్లని పిట్టగూడు కడతాను
అక్కడ గుట్టబోరుకింద
నల్లచట్టపు టాడా పడగనీడలో
గుట్టుగా రాబందుల సమావేశం జరుగుతుంది
ఇక్కడ నిశ్శబ్దంగా
కలంపట్టి రాస్తున్న నా చేతిని
అకస్మాత్తుగా ఒక ఇనుపపాదం
నరుక్కొని పోతుంది
పథకం ప్రకారం
తెగిపడిన ఐదు నక్షత్రాలు
నాటేసే పొలాల్లో రాలిపడతాయి
అమ్మా
సంవత్సరాల నీ ప్రశ్నా సమూహాలు
ఏ హెచ్చరిక లేకుండా
చుట్టుముట్టబడి
బురదలో దిగబడ్డ మట్టిపాదాలు
సమాధానాలవుతాయి
చెట్లు కన్నీళ్ళు తుడుచుకుంటాయి
రాళ్ళు గాయాలను తడుముకుంటాయి
సాయంత్రం సూర్యుడు
రక్తపు మరకల్ని కడుక్కుంటాడు
ఇవాళ అప్రకటిత యుద్ధంలో
మనిషి పొందే ఆశ్రయం తెలంగాణా
వెంటాడే శత్రువును
మర్లపడి ఢీకొనే యోధుల పౌరుషం తెలంగాణా
చిరకాలపు దుఃఖాలను చూసి
నోళ్ళు తెరిచిన బీళ్ళను చూసి
తల్లడిల్లే నల్లమబ్బు నా తెలంగాణా

మృత్యువుతో తలపడినప్పుడు
చేతుల్లోకి తీసుకొని
నుదుటిని ముద్దాడే భూమితల్లి తెలంగాణా
ఇవాళ తెలంగాణా
పల్లెల పొలిమేరల్ల
వలపోసే ముసలవ్వమట్టిదోసిళ్ళు
పంటసేనుకాడ
కాచుకొని కూచున్న
బక్కరైతుల గుత్పకట్టెలూ
పొదల చాటునుంచి పొంచిచూసే ఖడ్గనేత్రాలు
పదునుగా విచ్చుకున్న గోగుపూలూ
ముక్తకంఠంతో జేజేలు పలుకుతాయి
విముక్తి మీద విశ్వాసాన్ని ప్రకటిస్తాయి

*1-11-1998*



# కొల్వులోల్లం

మోతుకూరి అశోక్‌కుమార్

గట్ల శిత్రంగ జూడకుండ్రి బాంచను !
పెయినింద గీ పేగులు జుట్టుకున్నందుకు
గట్ల శిత్రంగ జూడకుండ్రి - మా పానాలవుశిపోతయి -
ఎన్కట యవ్వారం గాదని మేమేమన్న
కొత్తపోకడ బొయినాం నాయినా...?
గంజిలీగోలె గదే బత్కు బత్కవడ్తిమి...
గానుగెద్దోలె గట్లనే దిర్గవడ్తిమి...
ఇష్టమున్న లేకున్న గదే బుర్దల బొర్లవడ్తిమి -
గట్లేమంటే... కులం అక్కుబాపతండ్రి;
మేం నోరు దెర్శి అడ్గెతందుకు మాకు నోళ్ళున్నాయి బాంచను-?
మా కష్టాలక్కాల్లున్నాయి కాల్మొక్తా-?
ఈడచ్చీ రాకముందే తొల్త బుట్టిందాన్ని ఊరుమీదకిడ్వాలె...
అది ఏడేడు పట్టాల్ దొక్కి ఆడనేర్వాలె...
శానైందంటే మేం ఒక్క పొద్దిడిశినట్టు,
మా పోరగాండ్ల ఉసురు బోస్కొవడ్తిమి,
అది కొంగెయ్యని జాగనే ఉండది బాంచను-
ఏం జేస్తం నయిన పయిసకోసం
గడియకో గండమోలె దినాలెల్ల దీస్తం,
జీవిగొట్టుకలాడ్తది మీపాదాలొట్టు మాతండ్రి-
ఇష్టమచ్చినోళ్ళు.... ఇష్టమచ్చినట్టు
యాడ్కిరమ్మంటే గాడ్కచ్చి
ఏం జేశినా సావక బత్కుతుంటం నాయిన-
మాకేదన్నాదర్వ్యజేసే తండ్రులున్నారు బాంచను!

రోగమచ్చి పంటె మమ్లగానెటోళ్ళుంటారు కాల్మొక్త?
కడుపై కాలవడ్డా.... దాని బతుక్కి బరోసకమ్మి;
పొద్దు వొడిశేతందుకు యాళ్ళున్నది...
పొద్దుగూకేతందుకు యాళ్ళున్నది...
మాకు యాళ్ళ పాల్లున్నాది నాయిన-
పురాగ పొట్ట గోస్కుంటున్నం బాంచను-?
లగ్గాలచ్చినా... సావులచ్చినా... అళ్ళముంగటాడాలే...
అళ్ళ పీన్గుల ముంగటాడాలే...
మా పోరగాండ్లు ప్యాలాలేర్కుంటరు
మేం పైస లేర్కుంటం...
జోలెగట్టి ఒక్కొక్క పైస.... కండ్లకద్దుకోవడ్తిమి-
మేం కొల్పులోల్ల మైతిమి... మా బత్కే గంతతండ్రి!!
మేం జచ్చినా అడ్గెటోళ్ళుండరు-?
మేం సత్తెనాసైనా మారెక్కల కష్టమాగద్దు...
మా ఆటలాగద్దు మమ్ల దోస్కపొయ్యె
గాబద్దుమాసి తనమాగద్దు...
మేం కుక్కలు జింపిన యిస్తర్లం నయినా-?!
మా తండ్రులు మీరు! సచ్చి మీ కడ్పున బుడ్తం...
మీ పాదాల సాచ్చి తండ్రీ...
మా కలకల వట్టిగవోదు-
తలుబెట్కొనున్నా మేం కొలుబ్బెట్టి శెప్తం...
మేం కొల్పులోల్లం నాయినా!
రంగం మెక్కే కొల్పులోల్లం!!

23-7-88



# రావురూకుల

కందుకూరి శ్రీరాములు

భూమ్మీద చందమామ మా ఊరు
నక్షత్రాల ఇండ్లు
మేఘాల గుడిసెలు
అదో చంద్రమండలం !

సిద్ధిపేటకు దుబ్బాకకు మధ్య
నోట్లో నాలిక
కొన్నాళ్ళందులో కొన్నాళ్ళిందిలో
రెండు మండలాల నడుమ నలిగిన
గుడ్డ పీలిక
ఊరుపేరు రావురూకుల
మెతుకుసీమలో విచ్చుకుంది పువ్వురేకులా

కోడి కూయకముందే
లేడిలా లేచేది మాపల్లె
సందుగుట్ట మీంచి సర్రున వీచేగాలి
మా చెవుల్లో సూదులు గుచ్చేది
మా ఊరు మధ్య ఓ బురుజు
బురుజు మీద ఒక చెట్టు
మహా గొప్ప దృశ్యం
మనిషి గొడుగు పట్టుకుని
నిలుచున్నట్టుండేది

వెన్నెల మైదానంలో ఆడుకునేవాళ్ళం
పాడుకునేవాళ్ళం

హరన్న హరిలూ - ఉప్పు డబ్బాలూ
పారుగూర్లకు పోయేందుకు
మా ఊరు చుట్టూ తలలో పాపెటలా పిల్లతోవలు
పెరిగిన వేతిగోర్లలా ముళ్ళకంచెలు
చెరువు నిండితే గ్రామం చుట్టూ
ఒక పొడుగాటి కాలువ
మెడలో వేసుకున్న అదో నీటిహారం
దానికింద వరిపంట పచ్చని పతకం

ఊరుపక్క ఊరు పుల్లూరు
దాని పక్కనే ఏనుగంత బండ
మాఘమాసంలో ముచ్చటగా
మూడురోజులు సాగుతుంది జాతర
ప్రతి ఏటా జాతరకు వెళ్ళి వచ్చేవాళ్ళం
నడుముకు కొత్త మొలతాళ్ళు
మెడలో బత్తీస పేర్లు వేసుకునేవాళ్ళం
బండమీద పెద్దమ్మలోళ్ళ బుగులు
పోలీసులోల్ల కన్నా ఎక్కువే -
అప్పట్లో మా పల్లె నుండి దొమ్మాటపట్టీకి
బస్సులుండేవి కావు
అంతా జంగలే
చీకటి పడకముందే ఊరికి చేరుకునేవాళ్ళం
దొమ్మాటకు వెళ్ళటానికి ఎన్నో ఊర్లు దాటాలి
అందితే 'అందె'
అందకపోతే 'అల్వాల'
తప్పితే మిడిదొడ్డి
ఈకూత మా ప్రాంతాన సామెత

మా పల్లెపైన ఎల్ల సముద్రం
దానికింద పెద్ద చెరువు
తూము వదిలితే
వాగులాగ 'దండుబాట' మడుగు
అదో ఈత సరస్సు మాకు
బాతుల్లా ఈదేవాళ్ళం



ఎంత మునిగినా గొంతువరకే నీళ్ళు
మా ఊరిలో పారుతున్న స్విమ్మింగ్‌పూలది
పెద్ద చెరువు నట్టనడుమ 'నాగులగడ్డ'
చెరువు నిండితే కనిపించేది కాదు
అలుగులు దుంకుతున్నప్పుడు
నాగులగడ్డ మీద నిలబడాలనీ
చెరువు మధ్యలో చెట్లోలే తేలాలనీ
మహా చెడ్డ కోరిక
పోటిపడి చెరువులో పడేవాళ్ళం చేపల్లా ఈదుకుంటూ పోయి
నడుమ గడ్డ దొరక్క దమ్ముదమ్మయి పోయేవాళ్ళం
కష్టపడి ఎవడో కనిపెడితే
ఎవరెస్టు శిఖరమెక్కినంత అనుభూతి

రంగులపండుగనాడు
పీరీల ఊరేగింపు నాడు
ఊరు ఊరంతా జాతరై ఊగేది
సంకురాత్రి పండుగొచ్చిందంటే 'సకినాలే సకినాలు'
పొద్దున్నే వాకిట్లో అడుగుపెట్టటం యమకష్టం
ముగ్గు తొక్కినోని వీపంతా
నుగ్గునుగ్గయ్యేది

వైశాఖపూర్ణిమనాడు
రాత్రంతా రథం తిరిగేది
వలపట ఒక దండెడ
దాపట ఒక దండెడ
రెండూ మైలంత దూరముండేవి
దండెడలు పట్టుకొని రథాన్ని లాగటం
చీమలు పామును పట్టుకొని పోతున్నట్టుండేది
మూడేళ్ళ పిల్లోన్నుంచి ముసలి తాతల్దాకా
దండెడ పట్టుకునేవాళ్ళు
అలా చేస్తే పుణ్యం చేసుకున్నంత విలువట
రథం తొక్కిసలాటలో ప్రతి ఏటా
చక్రాల కిందపడి చేతులూ కాళ్ళూ
విరగ్గొట్టుకున్న వాళ్ళు కోకొల్లలు

రాత్రిళ్ళు చిరతల రామాయణం చిందులేస్తుంటే
కళ్ళప్పగించుకొని చూసేది పల్లె
చాందినీ ముందు
జోర సంచులేసుకుని కింద కూచునేవాళ్ళం
బాగోతం ఆడేవాళ్ళెగురుతుంటే మా నోట్లో అంతా దుమ్మే
'రామచంద్రుడనే రభసముతో వినరవాలి'
అంటూ రాగం తాళం పల్లవి -
ఆ రాత్రంతా రాముడందరికీ దేవుడే
మరునాడు
రాముడు వేషధారి రాజిగాడు
దొరింటి జీతగాడు

యూనిట్ పరీక్షలే
బోర్డు పరీక్షలవుతున్నంత శ్రద్ధ మాకు
రాత్రంతా కిరోసిన్ బుడ్డి వెలిగించుకుని
చదువుకుందామని వంగిన గొర్రె తలకాయలు
వంకాయలు జోకుతుంటే
ముంగురులు అంటుకుని
ఇల్లంతా కమురువాసన కమ్మేది
తెల్లారి చూస్తే
చెమన్ కత్తిరించినట్టు జుట్టు -
'బతుకమ్మ పండుగంటే
పూలకోసం వెతుకమ్మ అనేవాళ్ళు'
ఎన్నిరకాల పూలో
వేటగాడు తిరిగినట్టు
పూలకోసం వలపన్నే వాళ్ళం
మోపులు కట్టుకొని తెచ్చి
రంగులద్ది
సద్దుల బతుకమ్మ పండక్కి
గుమ్ములోలే పేర్చేవాళ్ళం
ఇంటింటి బతుకమ్మలు
కచీరు ముందుకు రాగానే
ఈతవనం ఈనినట్టుండేది



పట్టుచీరెలు చుట్టూ తిరుగుతూ
చప్పట్లతో ఉయ్యాల పాటందుకునేవాళ్ళు
ఆ ఆట
ఆడపడుచుల అందాల ఇంద్రధనుస్సది

దసరా సరదా మగవాళ్ళదే
పాలపిట్టల కోసం పజ్జొన్న కంకులకోసం
కొత్తబట్టలు వేసుకున్న మనుషుల మంద
కొంగల గుంపుల్లా అలాయ్ బలాయ్ చేసుకోటానికి
అంతా ఊరు సాయంత్రం కదిలేది
చెరువుగట్టో
చెట్టు గుట్టో ఎక్కి
పాలపిట్టలు చూస్తే పట్టిన పీడ పోతుందనీ
పజ్జొన్న కంకి దొంగతనం చేస్తే
కాగుల్నిండా ధాన్యమేననీ,
'జంబాకు' జేబుల్లో ఉంటే
బంగారం ఉన్నట్టేననీ
ప్రతి ఏడూ చెప్పినట్టే
ఈ పండక్కీ నమ్మకంగా అర్థం చెప్పి
అయ్యవారు కమ్మంగా తీర్థం పెట్టి
'శఠగోపం' పట్టి ఆశీర్వదించేవాడు
నమ్మకాలన్నీ నామమాత్రానికనీ
మంత్రాలకు చింతకాయలు రాలవనీ
తర్వాతతర్వాత మెల్లంగా తెలిసిపోయింది

ఊరిమధ్య మర్రిలాగా పెరగాలనీ
అందనిదేదో అందుకోవాలనీ
ఆనాడే అనుకున్నాం దోస్తులం మేం
పొద్దుగూట్లే పడ్డప్పటి ఆలోచనే
పొద్దు పొడిచింది ఇప్పుడిప్పుడే

ఊరికి ఉత్తరాన
అగ్గిపెట్టెలా మా స్కూలు
అందులో పుల్లలోలె పిల్లలం మేం

బడి గదుల చుట్టూ
చాపంలా అవారు గోడ
స్కూలు నడుమ బాణంలా తాటిచెట్టు
చీకటి రాకాసిని చంపడానికి భూమ్మీది నుండి
ఆకాశానికి సంధిస్తున్న అస్త్రంలా ఉంది
అదో గొప్ప దృశ్యం

భూమ్మీద చందమామ మా ఊరు
నక్షత్రాల ఇండ్లు
మేఘాల గుడిసెలు
అదో చంద్రమండలం మాకు

11-1-2000



# సమ్మె

దేశపతి శ్రీనివాస్

పొగ చూరినకుండలో
రెండు అన్నం మెతుకులు
మసిబారిన గూట్ల
మలిగిపోకుండా వెలిగే
మట్టి దీపంతలు
సారెమీద ఆకారం దిద్దుకుంటున్న నునుపైన
మట్టి ముఖాలు

చెక్కపేడు దిగితే
బొటబొటగారే నెత్తుటిబొట్టొకరు
బోరింగు కొట్టీ కొట్టీ
ఛాతీని అదిమిపట్టుకునే
సలపరం బాధొకరు
శిధిల రుతువుల్లో
జీవధాతువుల్ని కోల్పోని
రెండు ఆదిమ స్వరాలు

రాజ్యం రాక్షసిపిట్ట
గుడిసె మీద వాలినరోజు
తొడల మధ్య
దెబ్బల్ని కాచుకునే
ప్రాణం తొక్కులాటొకరు
ప్రపంచం నెర్రెల్లో
రక్తం వర్షించిన
కంటివాన ఇంకొకరు

సర్కారు తుమ్మల
కొశ్శదనం తెల్వని
రెండు సీతాకోక చిలుకలు

సూర్యుని చుట్టూ
గ్రహాలు తిరుగుతాయి
జైలుచుట్టూ
జీవితబంధాలు తిరుగుతాయి
ఒడ్వని దుఃఖంలా
ఎడతెగని నడక
ఇంటికీ జైలుకూ ఒకరు
జైలుకూ చావుకూ ఇంకొకరు

చంద్రుడు చచ్చిపోయిన
ఒంటరి వెన్నెల సమ్మ
రాజ్యం రంపపుపళ్ళతో కోస్తే
కావడిలో మిగిలిన
ఒకే ఒక్క కన్నీటికుండ
హాస్పిటల్లో
బూజుపట్టిన మూల
గండుపిల్లులు తిన్న
పెనిమిటి శకలాల ముందు
సముదాయించుకోలేని దుఃఖం సమ్మ
అక్షరాలు సైతం
గుక్క తిప్పుకోకుండా
ఏడుస్తున్న విషాదకావ్యం
శవదుఃఖం పై
కక్కుతున్న శరీరకాంక్ష రాజ్యం
ఎగిసిపడుతున్న
నెత్తుటికొండలపై వాలిన
వెకిలిచూపు రాజ్యం
ఊపిరి తెగిన ఊరపిచ్చుకని
ఉంచుకుంటానని ఊరడించే
రక్షణ రాజ్యం



సమ్మ చేతుల్ని
సవరించుకుంటుంది
కన్నీటి చారికల్ని
తుడుచుకోవటానికి ఒకటి
సిగ్గుకు వెలకట్టిన చిల్లరని
రాజ్యం శవోత్సవంలో
గురిచూసి విసరడానికి... ఇంకొకటి

*ఆగష్టు 1997*

# కన్నపేగు, గుండెలయలు

పప్పుల రాజిరెడ్డి

కొడుకా బాలచంద్రుడా
నువ్వు మాకు కాకుండా పోయింది మొదలు
చేతగాని మా కాళ్లేతులకు పారాపలుగులు కట్టుకొని
మా కళ్ళల్లో వత్తులు వేసుకొని పన్జేస్తూ
బతుకు బండి లాక్కెళ్ళుతున్నాం
మన ఇంటి ముందు వాకిట్లో
ఎవ్వరి చెప్పుల సవ్వడి విన్నా
నీ రూపం మా కళ్ళల్లో వేలాడుతూనే వుంది
నీ స్పర్శకోసం అటూయిటూ వెతుకుతుంది
దండెం కొయ్య మెడమీద కదులుతున్న తువ్వాల
నీ రాక కోసం ఎదురు చూస్తోంది
నీ ముళ్ళుకర్ర - నీ కాడెడ్ల జోళ్ళు - పెద్దపీటకింది
చెక్క పెట్టెలో అమాయకంగా
మూలుగుల శబ్దాన్ని గుక్కలో అణచుకుంటున్నాయి
కొడుకా మా వెండికొండా
నువ్వు మమ్మల్ని ఎడబాసిందే తడవు
వచ్చిపోయే వాళ్ళు రాలేక
మన వసారా చిన్నబోయింది
వాకిట్లో గడ్డి మొలిచింది
ఇంట్లో దిగూట్లో 'రేడియ' మూతి ముడేసుకుంది
గడియారం గుండె ఆగిపోయింది
పొద్దుందాకా పడుకుంటే పొట్టగడువదాయె
తెల్లారేదాకా పడుకుంటే నిద్రపట్టదాయె
రంధి మా ప్రాణం తింటంది



దిగులు రంపం గుండెకోత పెడుతుంది
రాత్రిపూట తలుపు సప్పుడు కాంగనె
మాప్రాణాలు అరచేతిలో పట్టుకుంటాం
మా కాళ్ళు మా మాట వినవు
మా చేతులు మా అధీనంలో వుండకుండానే
నిస్తేజమై - నిర్వీర్యమై - అచేతనమై అపరాధిలా చేతులెత్తుతాయి
కొడుకా మా వజ్రాల తునకా
నువ్వు లేవని ఏడువాలా - బతుకు ఈదలేక చావాలా
నువ్వే చెప్పాలిరా - నువ్వే చెప్పాలీ
కష్టాల్లో మునిగి వుక్కిరి బిక్కిరి అవుతున్న వాళ్ళనీ
ఆదుకుంటాననీ - వాళ్ళ కన్నీళ్ళనీ పంచుకుంటాననీ
ప్రేమను బాంధవ్యాన్నీ పెంచుకుంటాననీ
నువ్వు రాసిన ఉత్తరం విన్నాం
బహుశా నీ నిర్ణయం నీకు కిరీటం తెచ్చి పెడ్తుందేమో
మా కడుపుకోతనరికడుతుందా
కొడుకా మా ముద్దుల బంగారు కొండా
నువ్వు ఇల్లు విడిచిపోయిందే ఆలస్యం
మన ఇల్లు స్మశాన మయిందిరా -
నలుగురి మాటకు నోచుకోనిదయ్యిందిరా
మా ప్రేమను ఎవరితో పంచుకోవాలెరా
మా అలికిడినీ - మా ఆర్తిని అంటనివ్వని
యీ రెండు మూతుల పాముల తోనా
మా మాటనీ - మా నీడనీ బహిష్కరించిన
కపటబాజీ మనుషులతోనా
చాతగాని ఈ ముసలి పీనుగలను వుద్ధరిస్తావనుకున్నాం
కలోగంజో తెచ్చి కంచాన పెడతావనుకున్నాం
మా కళ్ళ ముంగట పిల్లాపాపల్తో సుఖంగా వుంటావనుకున్నాం
కొడుకా కొడుకా మా ముద్దుల సందమామా
    మా బతుకెట్ల గడువాలెరా
    మాకు పొద్దెట్ల పోవాలెరా
    బిడ్డా మా పగడాల కొండా
    నువ్వే చెప్పాలెరా - నువ్వే చెప్పాలె

*10-8-1994*

# మట్టి మనసు

*వేముగంటి మురళి*

మనసుంటే
ఎక్కడైనా మనిషి
మనిషిలానే తేలుతాడు
అర్థం కాకపోయినపుడు కూడా
ఏదీ అడ్డు చెప్పడు
కరపత్రంలోకి ఒదిగిపోయిన
ఒక్కొక్క అక్షరంలో మెరుస్తాడు
అప్పుడప్పుడు
మాట్లాడే సమయంలోనూ
మూగగా దిక్కులు చూస్తాడు
గోడకు అతుక్కుపోయిన
పాతపోస్టర్‌లా కనపడినా
కొత్త ఉత్సాహం
శరీరమంతా కనపడుతుంది

మనసుంటే
ఎడారిలోనైనా మనిషి
రెండు చేతులతో ఒక
ఒయాసిస్ తోడుతాడు కదా

అసలు చిక్కుముళ్ళన్నీ
మనసులోని డీప్‌ఫ్రిజ్‌లో బంధించి
ఖాళీ శరీరంతో
ప్రయాణం చేస్తున్నవాళ్ళతోనే



పారిపోయిన ఊహల్ని కూడా
కాగితంపై పెట్టనివాడు
మూగగా రోదించినా
ఎవరూ పట్టించుకోరు

వలసవ్యాపార పక్షులు
మన చెవిలో కాటన్‌బడ్‌లయి
గాయం చేసినా
మనసు మనసులా మాట్లాడదు

చిక్కుముళ్ళన్నీ విప్పుకోవడమంటే
మనసుని మట్టితో కడిగినట్లే
మనసుతో మాట్లాడే మనిషంటే
మట్టికోసం మనిషిలా ప్రవర్తించడమే

*మే, 2000*

# తాకట్టు

కె. రంగాచారి

అందంగా ఎగురుతున్న పక్షుల్ని
అమాంతంగా వలవేసి పట్టి మాయం చేయడం
గోళ్ళలో గుండు సూదులు గుచ్చి
సున్నితమైన చెక్కిళ్ళను చెక్కిపారేయడం
చిత్రహింసలు పెట్టి లాకప్‌డెత్‌లు చేయడం
ఎన్‌కౌంటర్ చేయడం
ఇప్పుడు పాత పద్ధతైపోయింది
కట్టె విరగకుండా
పాము చావకుండా
కత్తి కనబడకుండా
మీ అస్తిత్వాల్ని దోచుకోవడానికి
ఇప్పుడో కొత్త పద్ధతి ప్రవేశపెడుతున్నాం
మిమ్మల్ని అణువణువునా హింసించడానికి
మా పోలీసు బలగాల చేతులు చాలడం లేదు
అందుకే ఇప్పుడు మిమ్మల్ని
ప్రపంచ పోలీసు చేతుల్లో పెడుతున్నాం
రైతులారా !
ఇక మీరు నీళ్ళ గురించి అడగక్కరలేదు
అప్పుల్ని అడగక్కరలేదు
భూముల్ని అడగక్కరలేదు
ఎరువుల్నీ అడగక్కరలేదు
ఎందుకంటే ?
విత్తుకోవడానికి మీ విత్తనాలుండవు గనక
మేధావులారా !



ఇక మీరూ ఆలోచించనక్కరలేదు
హక్కుల్నీ అడగక్కరలేదు
మీరేం ఆలోచించాలో మేమే నిర్ణయిస్తాం
ఎందుకంటే ?
మీ మెదళ్ళపై పేటెంట్ హక్కుల్ని
ప్రపంచ పోలీసుకి రాసిచ్చాం
వ్యాధిగ్రస్తులారా !
మీకు గుండెపోటు వచ్చినా
జ్వరం వచ్చినా
చివరికి జలుబు చేసినా
ఇక మీరు చనిపోవాల్సిందే
ఎందుకంటే
మీకు అందుబాటులో ఏమందూ ఉండదు గనక
ఓ నా భారతదేశ ప్రజలారా !
మీరేం కొనాలో
ఏం అమ్మాలో
ఏం తినాలో
చివరికి ఏం మాట్లాడాలో మేమే నిర్దేశిస్తాం
ఎందుకంటే ?
మీ దేహాల్ని ప్రపంచ పోలీసుకి
తాకట్టు పెట్టేశాం

# తేజాబ్ పడ్డ బతుకులు

పోగుల రాజన్న

మా బ్రతుకుల్ని పత్తిచేళ్లని చేసి
జీవితాల్ని దూది గింజల్లా సాగదీస్తున్నాం
మొగ్గం భీమ్‌కు గుండె నాడనేసి -
శరీరాల్ని జోడాల్లా నేస్తున్నం
గంజినీళ్లలో ప్రేగుల్ని తొక్కేసి
ఎండలో పోగుల్నారేస్తున్నాం
మావి 'తేజాబ్' పడ్డ బ్రతుకులవుతున్నాయ్
చెరఖారాట్నంలో గిరికీలు తింటున్నాం
ఏం పాపం చేసినామో తెలియదు
కళ్లని కండెల్లా చుట్టినా -
"ఎనభై నెంబర్" నూలుపోగు ఇంకా
మా కళ్లని పరీక్షిస్తూనే ఉంటుంది
వాళ్లేమో.... అంగట్లో...
మా శరీరాల్ని జోడల్లా అమ్ముతున్నారు
అగ్గిపెట్టెల్లోని జరి అంచు చీరని కట్టి
ఒంటి వయ్యారాల్నొలకబోస్తున్నారు
సిల్క్‌బట్టలై ఖద్దర్ బట్టలై మెరుస్తున్నారు
చిటికీలు కట్టే మా చేతుల్ని
చిటికెల్లో మాయం చేస్తున్నారు
ఏం పాపం చేసినామో తెలియదు
దీపం వెలిగించడానికింట్లో వత్తైనా ఉండదు
మొలతాడుచుట్టడానికి పురిదారమైనుండదు



మా బ్రతుకుల్ని తొంగి చూడండి...
పొయ్యి మీదున్న కుండల్లోకి -
ఎండుతున్న డొక్కల్లోకి -

చిరుగుల గోచిల్లోంచి - మాసికల కొంగుల్లోంచి -
పిర్రలపై చిరిగిన పోరగాళ్ల చెడ్డీల్లోంచి -
గుండెల్ని బాదుకుంటున్న జెండా గుడ్డల్లోంచి
దేశం స్పష్టంగా కనబడ్తుంది
వాళ్లు.... మడిబట్ట కట్టడానికై
శరీర అందాల్ని కప్పడానికై
మా జీవితాల్ని ఒలుస్తున్నారు
మా కడుపులు కాలిపోతే -
మా బ్రతుకులు ఆరిపోతే -
వాళ్ళిక ఆకులుకట్టుకు తిరగాల్సిందే...

7-1-1994

# జీవ చైతన్యం

మహమూద్ పాషా

కళ్ళ ముందు కాలం గుట్టలు గుట్టలుగా పడి ఉంది
మంచులా కరుగుతూ –
"కన్ను" పారినంత దూరంలో
జీవితాలు కూల్చబడుతున్న దృశ్యాలే !
లక్ష్యంతో బతుకును అలంకరించుకొనే
సౌందర్యమైన ఊహ కల్గుతుంది.
కాలుతున్న సిగరెట్టు పీల్చి వదిలిన పొగ రింగురింగుల్లో
ఆలోచనలు ఉన్నత శిఖరాలవైపు
ఎగురుతాయ్ –
జీవితం పొడుగునా నడిచివచ్చే నీడ మన ధైర్యం !
జీవన అనంతయానంలోకి మనం జీవంతో
కదులుతూ ఉంటాం –
సమస్యల చిక్కుముడులు తీసుకొంటూ
మార్గంలోని రాళ్ళు, ముళ్ళు ఏరివేస్తూ
ఎత్తుపల్లాల మీద నడిచిపోతుంటాం !
రాత్రిని పగలు చేసే సూర్యుణ్ణి
పగలు రాత్రిని చేసే చంద్రుణ్ణి
రెండు చక్రాలుగా బిగించుకొని కాలం మైలురాళ్ళు
దాటిపోతాం !
జీవితంలోని ముచ్చటకోసం ఎప్పుడు ఆరాటాలు
పోరాటాలు మాత్రమే –
రాత్రి చీకట్లో ఆత్మీయత పేరుపెట్టి పిలుస్తుంది –
మన కోసం ఆశతో ఎదురు చూస్తూ ఉంటుంది
జీవితాన్ని అనేక రంగుల్లో
అనేక ఆకృతుల్లో సౌందర్యంగా మలుస్తుంది
కాలం !



# ఏమనాలో నోరు రావడం లేదు

యం.డి. అహ్మద్

మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్
మీవారేగా అంటున్నారు
నేటి బాలలే
రేపటి భావిభారత పౌరులని
టి.వి.లలో, రేడియోలలో, పత్రికల నిండా
చొల్లు కబుర్లు గుప్పిస్తున్నారు కదా సార్
మేం చదువుకుందామంటే
వెలుతురును మీవాళ్ళే మింగారు కదా సార్
మమ్మల్ని పట్టించుకోని
ఈ వ్యవస్థలో
మేం బ్రతకడం మా తప్పుకాదు
మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్
చదువుకునేందుకు
వెలుతురును అడిగామే తప్ప
మాకు ఏ పాపం తెలువదు
పోలీసు జులుం నశించాలి అనలేదు
ఈ ప్రభుత్వం పాపిష్టిది అనలేదు
ప్రభుత్వాలను కూల్చడానికి కుట్రను చేయలేదు
మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్
మా తరగతి గదిలో
మా మాష్టారు కొనవేళ్ళ తాకిడికే
బెదిరిపోయేవాళ్ళం

ఇప్పుడే వికసించే
లేలేత గులాబి మొగ్గలం
మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్
మీ అక్షరప్రభ బాకాలకు మేం కావాలి
మీ జెండాలకు జేజేలుకొట్టడానికి మేము కావాలి
మంత్రులకు, ప్రధానులకు
సలాములు కొట్టడానికి
రోడ్లపై బారులు తీర్చడానికి మేము కావాలి
మీవాళ్ళే కదా సార్
మమ్మల్ని రోడ్లపైకి తెచ్చింది
తెలిసి తెలియనితనంతో
మాకు వెలుతురు కావాలని వచ్చాం కానీ
మా వీపుల మీద మీ లాఠీల
రాజ్యాన్ని ఊహించలేదు సార్
జనారణ్యంలో లేడిపిల్లలను
వేటాడం చూపించారు కదా సార్
రక్షక భటులు అంటే
మనల్ని మన సమాజాన్ని రక్షించేవారని
మా మాష్టారు చెబితే
మురిసిపోయి జేజేలు కొట్టాం
ఇప్పుడు తెలిసింది సార్
మీరు ఎవరిని రక్షిస్తారో
మా చిన్నచిన్న మెదళ్ళకు అనుభవమైంది
అందుకే మిమ్మల్ని ఏమనాలో
మాకు నోరు రావడంలేదు.

17-8-1996



# ఉసురు

నందిని సిధారెడ్డి

ఇల్లు ఖాళీచేసినంత సులభంగా
జీవితం ఖాళీ చెయ్యలేం కదా
ఎంత భద్రంగా సర్దుకున్నప్పటికీ
ఏదో ఒకటి మరచిపోయినట్టు
గుర్తురాని ఏనుగు బొమ్మేదో వెంటాడుతుంది
దువ్వెన ముక్కో
విరిగిన పెన్సిల్ ముక్కో
కొంతదూరం వెళ్ళినంక గురుతొస్తుంది
వదిలిపెట్టలేమూ
తెచ్చుకోనూలేం

అయినవాళ్ళంతా ఎవరి పనుల మీద వాళ్ళు వెళ్లిపోయినప్పుడు
గోడమీద ఊడిరాని మేకులా
తనొక్కతే మిగిలిపోయింది
ఇన్నాళ్లూ మండీ మండీ
ఇవాళ బూడిదెత్తి
అలుకుపిడు చెయ్యని పొయ్యిలా
ఆమె దిగాలుగా ఉండిపోయింది
ఒంటరి వంటిల్లు దుఃఖపెడుతున్నప్పుడు
కిటికీలోంచి దూరొచ్చిన ఊరపిచ్చుక
అందమైన ముక్కుతో పలకరించి
సందడి సందడి చేసేది
ఇప్పుడదీ లేదు
బతికుందోలేదో కూడా తెలియదు
ఇల్లు ఖాళీ చేసినంత సునాయాసంగా జీవితం ఖాళీ చెయ్యలేం

ఇల్లు ఖాళీ చేసినంత సుతారంగా
ఊరు కూడా ఖాళీ చెయ్యలేం
పల్లెటూర్లో పచ్చటిబాల్యాన్ని
వీపుల మీద ఆడించిన
వీధుల తాతయ్యల్ని ఖాళీ చెయ్యలేం
తీరొక్క ఆటలు నేర్పి
తీయని పండ్లొలిచి పెట్టిన
మూడుగుండ్లకాడి మర్రిచెట్టును ఖాళీ చెయ్యటం కష్టం
కండ్ల ముందు కలల బతుకమ్మలు పేర్చే
పూలతోటలు ఖాళీ చెయ్యటం కష్టం
అన్నిటికంటే
అన్నీ అయి తలచిక్కులు తీసిన
అమ్మ ఒడి ఖాళీ చెయ్యటం మంటే
సన్నటి గునపంతో గుండెను తొవ్వుతున్నట్టుంటుంది
నేరమూ ఉండదు
నెత్తురూ మిగులదు
అప్పుడప్పుడు కుర్రాళ్ళు ఊళ్ళు ఖాళీ చేస్తుంటారు

బూట్లు టకటకలాడించుకుంటూ
ఖాకీ గుర్రాలొచ్చినప్పుడల్లా
ఊళ్ళు ఖాళీ చెయ్యటం వాళ్లకు తప్పనిసరైంది
జీవితం ఖాళీ చేయిస్తామన్నప్పుడల్లా
రోజులకు రోజులు ఊళ్లు ఖాళీ చెయ్యటం వాళ్లకు తప్పనిసరైంది
చీకటిపడేవేళ
తలుపుమీద లాఠీతో దబదబా బాదిన చప్పుడైతే
తలెల అన్నం వదిలిపెట్టి
పరిగెత్తటం కుర్రాళ్లందరికీ అలవాటే
నిద్రలోంచి ఉలికిపడిలేచి దౌడు తీయటం
వాళ్లందరికీ అలవాటే
మంచమ్మీద నుంచి లెవ్వలేని
ముసలమ్మలకే కష్టం !

లాఠీలు ఊపుకుంటూ లోపలికొచ్చినపుడే
ప్రాణాలు పోతాయి
బాలింత తల్లుల మానాలు పోతాయి



కేరుతున్న తల్లిలేని కోడిపిల్లల్ని
మాంసం ముక్కల కింద కోసుకెళ్లటం పోలీసులకలవాటే
ఊడ్చి సాన్పు జల్లిన
వాకిండ్లలోని ముగ్గులు కత్తిరించి
వ్యాన్‌లో వేసుకెళ్లటం పోలీసులకలవాటే
పోలీసులొచ్చి వెళ్లిన ఇల్లు - ఇకంతే !
మనిల్లు మనమే పోల్చుకోలేం
పోలీసులొచ్చి వెళ్లిన ఇల్లు
కలప నరుక్కపోయినాంక
చెట్లు పారిపోయిన అడవిలాగుంటది
పోలీసులొచ్చి వెళ్లిన ఇల్లు
ఎండాకాలం పూట
చేపలు పట్టినప్పటి చెరువును తలపిస్తది
ఎడ్లు వెళ్లిపోయిన దొడ్డిలా ఎలితిగా ఉంటది
పోలీసులొచ్చిన ఊళ్లో
ఆకాశమ్మీది చంద్రుడు కూడా
హఠాత్తుగా మాయమవుతాడు
మేఘాలు దభాల్న రాలి
ఏమూలో దాక్కుంటాయి
గాల్లో తేలివచ్చే కోయిలపాట
చెట్టు తొర్రలో దూరుతుంది
ఎక్కడా ఏమీ కనిపించదు
ఎవరయినా ఎంత బాధయినా
ఇగం పట్టించే డిసెంబర్ చలి రాత్రులయినా
ఉన్న పళాన ఊరు ఖాళీ చెయ్యాల్సిందే
ఊరడించడానికి ఊరపిచ్చుకా రాదు
చెట్టంత కొడుకూ రాడు
ఎన్ని రోజులయినా తల్లి దుఃఖం వొడువదు
ఇల్లు ఖాళీ చేసి
ఊరు ఖాళీ చేసి
అడవుల పాలయిన ఆ కుర్రాళ్ల
ముసలితల్లుల ఉసురు ఊరకే పోదు
ముసలి అవ్వల ఉసురు ఊరకే పోదు

12-12-1989

# సింగరేణి సూర్యుడు

దేశపతి శ్రీనివాస్

వేయిమంది ముఖాల్ని
ఓటమిలో మసిచేసి
ఒక్కడు
మంటల్లో నల్ల కలువై పూసాడు
ఒక్కడు
నాలుగు ముఖాలుగా విడిపోయి
నాలుగు దిక్కులా యుద్ధమై కంపించాడు
నేలతల్లి గుండెల్లో నిక్షిప్తమైన
నల్ల వజ్రం కాంతివాడు
జీవితాన్ని చుట్టచుట్టి
బరువు నెత్తుకున్న
చూలాలి తట్టకింద
మెత్తగా ఒత్తుకున్న చుట్టబట్టవాడు
మెరుపు సమ్మె కట్టి
బతుకులో సాధించుకున్న
మెరుపువాడు
బొగ్గుబాయి చీకటి మీద
పరుచుకున్న పొద్దైనవాడు
వాడికి యుద్ధమేమీ కొత్తకాదు
పదహారేండ్ల పోరాటమిచ్చిన ధైర్యం
చుట్టూ కంచె కట్టి కూర్చుంటే
కాలుపెట్టే సాహసమెవడికుంది



భూమి పొరల్లో బొగ్గును తెగ్గోసిన
చేతుల పదును
బొండిగ తెగేవరకు
తోడేలుకు అర్థంకాలేదు
బొగ్గుని అగ్గిచేసిన
కంటినిప్పుల గురి
కణతల్ని కాల్చేవరకు
అంతుచిక్కలేదు
లోపలున్నది
ఒక్కరో ? ఇద్దరో ?
జనమో ? జనయుద్ధమో ?
శత్రువు కంటికందని కాంతిపటలం
సూర్యుణ్ణి తాకే శక్తెవడికుంది ?
అదీ
గుండెను గ్రనేడ్ చేసి పేల్చగల
సింగరేణి సూర్యుణ్ణి తాకే శక్తెవడికుంది ?
కూలితల్లుల కన్నీటిలో
లాల పోసుకున్నవాణ్ణి
వాణ్ణి మంటలేం చెయ్యగలవు ?
శత్రువు పిరికితనం దుర్వాసన
చేతకానితనం కమురుకంపు
పత్రికనిండా పొర్లాడుతున్నది
అనంతాకాశంలో నిండిన
నీ ప్రాణపక్షి పదముద్ర
శత్రువు బూటకపు యుద్ధాల
బూజు పట్టిన కథను వెక్కిరిస్తున్నది
పదిహేనుగంటల నీ పోరాటంలో
ఆయుధంలో ఇంకా మిగిలిన
బుల్లెట్లని
ఈ దేశపు
పదిహేను సంవత్సరాల
యువకుల దోసిళ్ళలో పోస్తున్నది

మే, 1996

# శత్రు స్పృహ

తైదల అంజయ్య

నిశ్శబ్దం పొంచి వుంటుంది
నీడలు భయపెడతాయి
చాపకింద నీటిపాము కదిలినట్లు
నువ్ మేల్కొనక ముందే
శత్రువు చాలా రూపాల్లో ఎదురవుతాడు
ఇపుడు కంప్యూటర్లు అర్థమైనంత సులభంగా
సమస్య అర్థం కాదు
శత్రువు అసలు కనబడడు
అసలును మించిన వడ్డీగానో
ఆకాశాన్నంటే ధర రూపంలోనో
పంటకు పట్టిన చీడగానో
నీ వెంటనే తిరిగే కోవర్టుగానో
ఏదో ఒక విధంగా శత్రువాత పడకుండా
నువ్విప్పుడు ఇంటికి చేరలేవు
మంచెమీద నక్షత్రాలు వెలిగించుకొని
గడ్డిపూల ఊయలలూగిన పల్లెలకిపుడు
పాములు చొరబడ్డ ఇంట్లో
పల్లేరుగాయల నిద్ర
వాడు నీ తలను ఛానళ్ళకు కట్టేసి
నీ వాకిలిని ప్రొక్లయినర్ చేతులతో
పెకలించుకుపోతాడు
ఇంటిగుహలో కూర్చుండి
తగలబడిపోతున్న ప్రపంచాన్ని
నువ్విపుడు ప్రేక్షకునిగా మాత్రమే చూడగలవు



ఎన్నో చేతులు చేష్టలుడిగి వేలాడడం
చాలాసార్లు గొంతు చేదెక్కడం
రూపాయి ఉరితాడు కావడమూ చూస్తావు
వాడు రోకలిని తలకు చుట్టుకొని
శరీరాన్నుంచి ఆకలిని వేరుచేసి
మాట్లాడే రొదను వింటూనే వుంటావు
నీకిది ఎన్నో చావో తెలియదు
ఉట్టికెక్కకుండానే
వాడు దూరపు కొండల
స్వర్గాలను చూపిస్తాడు
శత్రువుకు కలలు ప్రమాదాన్ని సూచిస్తాయి
అప్పుడప్పుడు కలలు కూడా వ్యాపారమవుతాయి
కాచుకొని ఉండాలి
నమ్మకాల చాటున దాగి
ఎండుటాకుల మీద
నీ నడక చప్పుడు వింటాడు
నీవు నలిగిన గడ్డిపోచల మీద
గుర్రపు అడుగులను గుర్తించాలి
గాలిని వడబోసి పసిగట్టగలగాలి
ఇప్పుడు శత్రువు రూపాన్ని గుర్తించడం
శత్రువు కదలికల్ని గుర్తించడమే
అసలు యుద్ధం.

8-12-1999

# నీకోసం

కె. రంగాచారి

వాగు ఒడ్డు మోతుకు చెట్టుపై
రెండు పక్షులింకా మౌనంగా రోదిస్తూనే ఉన్నాయ్
తల్లి ఒడిలో తనువు చాలించిన
బిడ్డను చూసి ఊరు ఊరంతా కన్నీరు కారుస్తున్నది
ఒక్కరాత్రి సైతం నిద్రించని
నీ ఇరవై గజాల నేల
నీ స్పర్శకోసం పరితపిస్తున్నది
అన్నా మహేంద్రీ !
నిన్ను కాల్చిన నిప్పుకణిక సైతం
తలవాల్చి కన్నీరు కారుస్తున్నది
సగంకాలిన చింతచెక్కల్లోంచి
చిరునవ్వుతో నువ్వు పలవరిస్తున్నట్టే ఉన్నది
అన్నా మహేంద్రీ !
నువ్వు మరణించావంటే ఎట్లా నమ్మమంటావ్ ?
మంచు కురుస్తున్న చలిలో
చుట్టూ గొంగడి కప్పి
భుజం మీద చెయ్యేసి ముద్దుముద్దుగా
ఉద్యమపాఠాలు నేర్పుతున్నట్టుగానే ఉంది
అన్నా మహేంద్రీ,
మెతుకుసీమ నేలపై
నువ్ చల్లిన విత్తనాలు ఇంకా మొలకెత్తుతూనే ఉన్నాయ్



జీవితానికి నిర్వచనం ఇచ్చినవాడా
నువ్వు జీవించిలేవంటే ఎట్లా నమ్మమంటావ్
ఇందుప్రియాల రైతన్నలు
తలెల్లో పెరుగన్నం కలిపి
నీకోసం ఎదురు చూస్తున్నారు
ఒక్కసారి వచ్చి నీ రైతన్నల్ని పలకరించిపో

# చావూ బతుకూ

*అలాజిపూర్ కిషన్*

మేం చావాలో బతకాలో చెప్పండి

మీరు మాట్లాడుతుంటే
మేం మాట్లాడాలో లేదో చెప్పండి
మీరు మనుషులే అయితే
మేం మనుషులం అవునో కాదో చెప్పండి
మీరు మా చావుల లీస్టేదయినా తయారుచేస్తే దయచేసి చెప్పండి
ఇది దేశమే అయితే
మా దేశం అవునో కాదో చెప్పండి
మేమిండ్లు కట్టుకోవాలో లేదో
నాట్లేసుకోవాలో లేదో
మా పిల్లలుచదువుకోవాలో లేదో చెప్పండి
మేం ఒక్కపూటైనా తినాలో వద్దో
రాత్రిళ్ళు మా ఇండ్లలో పడుకోవాలో వద్దో
కనీసం మబ్బుల దొడ్డికి పోవాలో లేదో చెప్పండి

మా ఊరికి దావఖానెప్పుడొస్తదో అడగం
నల్లాలెప్పుడొస్తయో అడగం
మా ఊరికి బడెప్పుడొస్తదో
బస్సెప్పుడొస్తదో అడగం
వ్యానెప్పుడొస్తదో చెప్పండి
మీ రాజభటులెప్పుడొస్తారో చెప్పండి
కోళ్ళనీ గొర్రెల్నీ పంటనీ దాచుకోవాలి
మా బిడ్డల్నీ ఉన్నకాడికి పైసల్నీ దాచుకోవాలి



పెళ్ళాల్నీ పెళ్ళాలమెడల పుస్తెల్నీ దాచుకోవాలి
మమ్మల్నీ మాకంటి వెలుగుల్నీ దాచుకోవాలి
మీ వ్యానెప్పుడొస్తదో చెప్పండి
మీకోట్లేసిన ఈ పాపిష్టి చేతులెత్తి దండం పెడ్తున్నం
మీ రాజభటులెప్పుడొస్తారో చెప్పండి
మేం చావాలో బతకాలో చెప్పండి
మీ రాజ్యం మీ ఇష్టమే అయినా
మాకింత నీడుందో లేదో చెప్పండి
రాత్రి
మా ఊరికి చంద్రుని వెంట వెన్నెలొక్కటే రాదు
వెన్నెల్తో పాటు లాఠీలు తూటాలు నడిచొస్తాయి
ఊరిని మృత్యువావహిస్తుంది
అర్థరాత్రి ఇల్లిల్లు సోదా అవుతుంది
ఏడో తరగతి సాంఘీక పుస్తకం
దాస్ కేపిటల్ అవుతుంది
ఇలపీట ఆయుధం అవుతుంది
పన్నెండేండ్ల కొడుకు తీవ్రవాదవుతాడు
వీపులు కమిలాక అందర్నీ ఊరి మధ్యలో నిల్చోబెట్టి
మూడు పట్టీలోడు మైకందుకుంటాడు
వాళ్ళకన్నం పెడ్తే నూకలు చెల్లయంటడు
నీడిస్తే ఇల్లు కూల్తదంటడు
ఊర్లకు రానిస్తే ఊరుండదని వార్నింగిస్తడు
కొడుకువోతె ఇల్లుగూల్తె
పంటెండితే ఊరుకాడైతె
ఇంకా మేం బతికేం జెయ్యాలె
మమ్మల్నీ చావమంటారా ? బతకమంటారా ?
మీ రాజ్యంల మాకీయింత నీడ లేకుండ జేస్తె
మాబతుకుల కోసం మా రాజ్యం కోసం
చావడానికి మేము సిద్ధమే
ఒలకడానికి మా రక్తం సిద్ధమే

# తేల్చుకోండి

ఐలేని గిరి

జీవితమొక వరమన్నచోట
మనిషి ఒక ఉన్నత జన్మమన్నచోట
ఆ జీవితం అయిదు ముక్కలైంది
అయిదవ ముక్క మాత్రం నిమ్నకులమైంది
భావాధిక్య దుర్మార్గం విభజించిన మనుషుల్లో
మాది దూరంగా విసిరేయబడ్డ వెలివాడ అయింది

పశువుల కొట్టంలోంచి
పాయిఖానా దుర్గంధం లోంచి
మిమ్మల్ని శుభ్రం చేశాక
కొట్టం చూరులో దాచుకున్న అంట్లగ్లాసులోకి
అరగజంపై నుంచి మీ ఔదార్యం
చాయ్‌లా ప్రవహిస్తే
అదే మా కళ్ళకు అమృతమైంది

గిర్నీలకు వడ్లుమోసి
బియ్యంలోంచి రాళ్ళూ పురుగులూ చెరిగేసి
మొక్కజొన్నలొలిచి సంచుల్లనింపి
మీ నోటికాడికి అన్నందెచ్చాక
కొంగులో దాచుకున్న ముతకలోహపు పళ్ళెంలోకి
మీరు అంత దూరంనుంచే పాచీ ప్రేమ రాలిస్తే
మా కాలే కడుపులకు అదే పరమాన్నమైంది



మీ పెళ్ళిళ్ళకు బారాతు దీస్తే
దడక దడక దద్దడక దరువుల్తో మేం
దొప్పల్లాంటి కడుపుల దప్పుల్ని మోగిస్తే
కడబంతిలో మీకంటి చలువవల్ల
చారూ దప్పణానికో కల్లు పానీయానికో
నోచుకుంటే - మా కదే గొప్ప సంబరమైంది.

మీరు శవాలమీదికెగజల్లే నాణేల్ని
డప్పు దరువుల్తో వొంగుతూ లేస్తూ
నుదుటిబొట్టుగా అతికించుకోవడం
మా లేకితనానికి పరాకాష్ఠ అయింది

అంటువడ్డ మా శరీరం కరిగీ కరిగీ
మీ ఇంటినీ ఒంటినీ పెంచుతుంటే
ఏ పూటకాపూటగా మా బతుకు
మీ పంచన పడిగాపులు కాస్తే
మీ ఓ పచ్చనోటు చూపుకు
మా వేలిముద్ర జీవితాంతం ఋణపడింది

ఇంతా చేసి ఇంకా మమ్మల్ని అహంకారంతో
మీ పంటికింది బూతుగా మారిస్తే
మా ఆడోళ్లని చూపుల్తో మాటల్తో వివస్త్రల్ని చేస్తే
మా వెలివాడ పుండు మీద కారం జల్లితే
మిమ్మల్ని మనుషులుగా భరించేదెట్లా !
మీ సంస్కృతికి పాడెకట్టకుండా
మేం ఊరుకునేదెట్లా !

మా అస్థిత్వం మిమ్మల్ని వెలివేస్తోంది
మా దండోరా మొదలైంది
ఇక మీరు నోళ్ళు మూసుకుంటారో
జీవితాల్నే మూసుకుంటారో తేల్చుకోండి.

27-10-1996

# జనపదాల సవ్వడులు

యం.డి. అహ్మద్

మనం నడవ వలసిందే
మనం ఇంకా సుదూర తీరాల వరకు నడవవలసిందే
ఆదటల్ని అలసటల్ని ఆస్వాదిస్తూ
తడారిన ఎడారి గుండె లోతుల్లో
చెలిమెలు తవ్వుకుంటూ
మనం నడవవలసిందే
నిశీధి నిస్సారపు భూమి పొరల్లో
ఆశల ఆశయాల విత్తులు చల్లుతూ
ఋతువుల సమూహపు సితారా తంత్రులు
శృతి తప్పినపుడు
నిలువెత్తు వసంతాల లయలు నాటుతూ
నడవవలసిందే
కాలం రక్కసి శిలపై
భావాల పట్టు సడలింపులో
అల్లుకున్న భావబంధాలని నిర్మించుకుంటూ
హద్దులలో
అగాధాలలో
జనం మైదానం పునాదులలో
లేలేత పూదోటల్ని నాటుతూ
సుదూర తీరాల వరకు నడవవలసిందే
మానవుని అంతర్లీన చైతన్య కరదీపిక
మన నడక...
రెండు ధ్రువాల మధ్య



రెండు దృశ్యాల మధ్య
పలకరింపుల దిక్సూచీ నావిక
బాల్యం నుండి బాధ్యతల యవ్వనాల
పరంపరాధి పరవశాల వారధి
లయాన్విత రాగరంజిత
నదీ ప్రవాహ తరంగాల వేదిక
మన నడక....
జన సమూహ పదాల
పాదాల సవ్వడుల కలయిక

7-1-1998

# పొతం

కె. అంజయ్య

బుద్ధి తెలిసున్నుంచీ బువ్వ పెట్టావు
గడ్డి తిన్నపుడల్లా బుద్ధి చెప్పావు
గువ్వలా ఒదిగిన కదలికలకు రెక్కలిచ్చావు
కుబుసం విదిల్చిన ఆలోచనలకు
రూపమిచ్చావు
అక్షరాల్ని గుండెలో పొదిగి
భాషనిచ్చావు
చీమలబారులా కదలడం నేర్పావు
పదం పదం కలిపి
పాడిన పాటకు గురి నేర్పావు
నిప్పు రాజేయడం
నిత్యపాఠంగా మార్చావు
చేతలకు పురుడు పోసి
నిప్పుల గుండంలో నిలబడేలా చేశావు
నన్ను సారవంతం చేసిన నా తల్లీ
నిన్ను దూరం చేసుకోగలనా...

రెక్కలు కత్తిరించుకొని
యంత్రభూతంతో పరికరమైన వాళ్ళం
అనుభూతుల్ని ఛానల్స్ దృశ్యాల్లో
అనుభవిస్తున్నవాళ్ళం
గమ్యం రాబందుగా నీలికాసెట్లుగా
మెదళ్లపై సవారీ చేస్తుంది

నువ్వుకన్నతల్లివో
పెంపుడు తల్లివో



పచ్చగా వున్నంతకాలం
పశువులా నెమరేశాం
ఆశ బంగారు బాతయింది
జీవితంలో కోత మొదలైంది
కోతయంత్రపు పరికి కంప
సామిల్లుగా, టింబర్ డిపోలుగా మారి
అల్‌కబీర్, అల్లానాలుగా ఎదిగింది
స్వార్థషడ్యంత్రంలోంచి
మొలుచుకొచ్చిన ఆలోచన చట్టమైంది

గ్రామాలు దిక్కులేని పక్షులై
పట్టణాలకు వలస
పచ్చదనం దొరకని మురికివాడల బస
పట్టణం ఊబిలో కూరుకపోయినా
కలలు రంపపుకోతతో తునకలైనా
బురలో పందిలా బొర్లటం

"గ్రామాలకు తరలండి" పిలుపు
ఉక్కుపాదాల కింద నలిగింది
ఓట్లకోసం చిమ్ముకొచ్చిన ప్రచారాస్త్రం
'జన్మభూమి'
కారుమబ్బు కమ్మిన కదలిక
మొగ్గలోనే కందిన బడలిక
పువ్వులా విచ్చుకోవాల్సిన పల్లె
విత్తు కట్టక ముందే
రాజకీయ రాళ్లవానకు తాలుపోయింది
ఎరువేసినా రసాయనం
నీళ్లు కట్టినా కాలుష్యం
మిగిలేది కడుపు మాడ్చుకోవటమే

నన్నునేను
నిన్ను నీవు దున్నుకొని
'మనం'గా పేన బడుదాం
పడావు పడుతున్న భూమిని పొతం చేద్దాం

జనవరి, 1998

# ఆకుపచ్చ దేశం

పప్పుల రాజిరెడ్డి

కామెర్ల రోగికి లోకమంతా
పచ్చగా కన్పించే మాటేమోగానీ -
వాళ్లకి మాత్రం దేశమంతా ఆకుపచ్చగానే కన్పిస్తుంది
పథకాల వేషంలో అభివృద్ధి
తాటాకుల గలగల చేస్తూ -
ఆలోచనలను హైజాక్ చేస్తుంది
నోరుండీ కళ్లుండీ నోటిలో మాటవుండీ బొమ్మలమైపోతాం
తకధిమి తకధిమి తోలుబొమ్మా...
చోద్యరాగం సామూహిక తాళం
కొట్టిన గండిని పూడ్చటానికి సరికొత్త వ్యూహాలు మొలుచుకొస్తాయి
మందుకావాలనే నినాదాన్ని మందికే అప్పగిస్తాయి
ఆర్థికస్థితిగతుల లబదిబలకు శ్వేతపత్రాలు తెల్లబోతాయి
గల్లాపెట్టె దివాళాకోరుతనం జీతభత్యాల నోరు మూయిస్తుంది
రాజదండం తల్చుకుంటే వరాలకు కొదవా దెబ్బలకు కొదవా
మందను మలిపే యత్నంలో మరో పన్నాగం ముందుకు వస్తుంది
ప్రజలారా యీరోజు మన వూళ్లో గొప్ప బహిరంగ ప్రదర్శన
శ్రమదాన చరిత్రం వురఫ్ జన్మభూమి వృత్తాంతం
పిల్లలూ పెద్దలూ వృద్ధులూ-ముఖ్యంగా విద్యార్థులూ టిక్కెట్లు ఉచితం
మీరే పాత్రధారులూ ప్రేక్షకులూ మీ వూరు మీయిష్టం

*

పారముఖం తెలియని ముతక ఖద్దరో
తట్టనూ మట్టినీ ముట్టని సిల్కులాల్చియో



వాహనాల్లో వూరేగుతూ పురమాయించే అధికార గణమో
వీడియో కెమెరాల ముందు దాసోహమౌతుంది
వార్తల్లో బతకటానికి నానా గడ్డి కరుస్తుంది
ఇష్టంగానో అయిష్టంగానో వారంరోజుల తంతు తూ-తూ
మంత్రమౌతుంది
మే ఎండల్లోనో ఆగష్టు వానల్లోనో నవంబర్ చలిలోనో
విడతల అవతారమై జోకొడుతుంది

*

బ్యాలట్ సంతతికి మాత్రం దేశం పచ్చగానే కన్పిస్తుంది
సర్కారు బళ్ల చవకబారుతనాన్ని కానిగిరి చదువులు
అపహాస్యం చేస్తాయి
స్టార్ హోటళ్ల విలాసాలు - సూపర్‌స్పెషల్ దవాఖానాలు
కావిరంగు గోచీ మానధనుడికి మయసభలవుతాయి
పజ్జొన్న పేలాలూ పాలు ధనియాలు వగైరా...
ప్యాకింగ్ సంస్కృతిలో ముస్తాబై దర్శనమిస్తాయి
అభివృద్ధి నాలుగు పాదాల దేకుడు నడకలో
వాళ్ళకు మాత్రం దేశం పొద్దు తిరుగుడు చేనులానే...
మనం మనకు తెలియకుండానే అమ్ముడుపోతాం
కార్పొరేట్ దయ్యం సోకి పచ్చబడిపోతాం
ఊళ్లు గాబరా పడతాయి పట్నాలు కాసుల పంటలవుతాయి
ఏళ్ల తరబడి చేసిన కష్టం నిచ్చెనమెట్ల వైకుంఠపాళిలో
బోర్లాపడి గుడ్లు తేలేస్తుంది
రాజ్యం నోట్లోంచి రాలే అభివృద్ధి మాటెత్తగానే-
సగటు మనిషి దేశం నిండు చెరువులానే...
కొరియాలాగనో జపాన్‌లాగనో కండ్లల్లో కదలాడుతుంది
పసుపుపచ్చ దేశానికి దేశం ఆకుపచ్చగానే అగుపిస్తుంది

*25-1-1997*

# నా పల్లె

*ఏలేశ్వర నాగభూషణాచార్య*

నా పల్లె నను వీడి ఒక్క క్షణం ఉండేదిగాదు
పక్కలో పరుండబెట్టుకుని పాశితీగలా
నా ఒళ్ళంతా అల్లుకునేది
నేను పల్లెను వీడినా... అనుక్షణం నా చుట్టూ నా పల్లె తిరుగుతుండేది
ఆకలేసి కేకలేసినపుడు పల్లె కన్నీళ్ళతో నా దాహాన్ని తీర్చేది
ఆశల తాళ్ళతో ఆనందపుటూయలగట్టి
అరవిరిసిన పొత్తిల్లు పరచి నన్ను పరుండబెట్టి
నిద్రనాన్చే జోలపాట పాడేది
మృదువైన నా శరీరానికి మొరటురాళ్ళు అంటకుండా
సుతిమెత్తని పచ్చిక బయళ్ళమీద పరుండబెట్టేది
నా ఒంటిమీద ఈగవాలితే నా పల్లె తన ముక్కును
తమాట లాగా తరిగేసుకోవాలన్న తపనతో చూసేది
నా పల్లె పక్కలో పారుతున్న ఏరు మీద వంతెనకున్నంత
సంబంధం నాకు.... నా పల్లెకీను
తుఫాను తాకిడికి బరుసు ఒరాలమీద దొర్లిపడ్డప్పుడు
పల్లె తన భుజాలపైన మోసుకొచ్చి తెగబొడచిన గాయాలనిండ
తనకు తెలిసినగాయపుటాకుపసరు నింపేది
వెయ్యి రాత్రులు ఒకటైనట్లు నా గాయాల పాలపుంతల్ని స్పృశించేది
సహించని హస్తాలు తనమీద చేదుమాటలు చెక్కినప్పుడు
నన్ను తన గుండెలమీద పరుండబెట్టుకునేది
నా చిగురాకుల వయస్సు దాటి ముదురాకులా వయస్సు
దాటుతున్నప్పుడు
నా పల్లె మీది గుండె చెరువును చూపించింది

*



చెరువుగట్టుపై కూర్చొని చేతికందిన చేపల్ని బట్టి
అక్కడక్కడ చీకిపోయిన కట్టెపుల్లలేరుకుని
చేపల్ని కాల్చుకుని చెరువుకింద చెరుకుతోటలో
ఆకల్ని కడుపునిండా దూరం చేసేసుకుని
గుక్కెడు గుక్కెడు నీళ్ళు తాగినప్పుడు
చెరుకు ఆకులన్నీ సుతారంగా వీపు నిమురుతూ...
చెక్కిళ్ళను ముద్దు పెట్టుకున్న జ్ఞాపకం
నా పల్లె ఒడిలో భద్రపరచుకున్న వజ్రాల ఆభరణంలా మేల్కొల్పేది
నా పల్లె మీది మమకారం ముప్పురి తాడులా అల్లుకున్నప్పుడు
పావులా పైసల గూర్చి నేర్పింది
బతుకు పాఠాల మర్మాల గూర్చి నేర్పింది
జనం పెదాలపై అలుముకున్న పాటల గూర్చి నేర్పింది
పగబట్టిన పాము పడగమీద పాదాలు మోపడం నేర్పింది
శూన్యం గిటారు మీద ఆకలి శృతిని మేళవించడం నేర్పింది
నా పల్లె ఎప్పుడూ నన్ను ముఖం మీది ముంగురులలో నే దాచుకునేది
నా పల్లె తల్లైంది.... తండ్రయిందు.....?!
చివరికి నా రక్తాన్ని పంచుకున్న అక్కయ్య అయింది....?!!
నడిగుండెలో దాచుకున్న నా పల్లె కడుపుకు
దగాకోరులు కనుపించని నిప్పంటించినపుడు
పల్లె.................. ఒక్కసారే భగ్గుమంది
ఇప్పుడు పల్లె చిన్నెలు లేకున్నా
నా కళ్ళలోనే పల్లెను పదిలంగా దాచుకున్నాను
నా పల్లె ఆనవాల్లను హృదయపేటిక మీద
మేకులా దిగ్గొట్టుకున్నాను

*28 మార్చి, 1990*

# కొత్త పాఠం

*మోతుకూరి అశోక్‌కుమార్*

అవును మేం పిల్లలమే.... ఎడ్డిపోరగాండ్లమే...
వెధవా! అనో... గాడిదా! అనో
ఏ వాచకంతో పిలిచినా పలుకుతూనే ఉన్నాం
నోరు తెరచి ఏనాడు ప్రశ్నాపూలని పూయించని వాళ్ళం
తెగిన మనస్సుతో ఏ విషయాన్ని ఆహ్వానించలేనివాళ్ళం
అప్పుడెప్పుడో.... చిన్నప్పుడే.... నోరుముయ్యిమని
ఉరిమి చూసే కనుగుడ్ల కింద
గాండ్రిస్తూ మీదకొచ్చే వాయిల్ బరిగెల కొనల కింద
ఎంతగా తెగిపోతూ వచ్చాం !
ఎన్ని గంటలు కొట్టినా... ఎన్ని తరగతులు మారినా
ఏమారిపోతున్న మా బతుకు గూర్చెత్తద్దు,
వచ్చీరాని రెక్కల్ని సవాలక్ష జాగల్ల నరుక్కునే మాటెత్తద్దు
మా అమాయకత్వాన్ని బలిపెడుతూ లైటు పురుగులమై తిరుగుతున్నం
మేం ఎడ్డిపోరగాండ్లమే మాకేం తక్కువ - ?
మీరెయ్యజూపుతున్న మార్కుల బరోసాల కోసం
మట్టిముద్దలమై మీ బాసన్లు తోముతున్నం
మీ బట్టలుతికి ఇస్త్రీలు జేస్తున్నం...
బస్సు దిగుతా వుంటే మీకు బరువవుతున్న సామాన్లు
మా నెత్తిన దించుకుంటున్నం...
బిడ్డా ! అని పిల్చినందుకు ఎంతగా కరిగిపోతున్నం...?
మీనోట్లో కాల్చిన మక్కజొన్న కంకులమవుతున్నం
మీ పిల్లల పెదాలు మెరవటానికి లిప్‌స్టిక్ పూతలవుతున్నం
టేప్ రికార్డర్‌లో దుబాయ్ కేసెట్లవుతున్నం



ఏ మాటకైనా చేతులు కట్టుకోవటం తప్ప నిలబెట్టిందెన్నడు ?
చూచి రాత రాయనోళ్ళ పేర్లు చదివితే తప్ప -
ఏడ మీ కోపానికి వీపులు చీరుకుపోతయోనని
బెల్లమంటె దెస్తిమి... మామిడికాయలంటె దెస్తిమి
మంది శేన్లల్ల దోసకాయలు దెంపుకస్తిమి...
తిట్లు దిన్నా... కొట్లువడ్డా మా పెయిలకే -
మీరెంతైనా తెలివిగళ్ళోల్లు...! బుద్ధి జెప్పెటోళ్ళు...!

*

ఎంత కాదన్నా మేం బాలక్యాలోల్లమే...
మాకూ ఆటలుంటయి.... పాటలుంటయి....
మన్సులిన్ని మాటలుంటయి
మాకు జాగల్లేకుంట జేయకుండ్రి
మా తావుల్ని నిషేధప్రాంతాలు జేయకుండ్రి -
తరగతిలో ఏది జెప్పినా బుద్ధిగా ఇనుడేనా మా తప్పు
తప్పుల్ని నిలదియ్యక పోవటమేనా మా తప్పు
పుస్తకాల్లోని నీతులు పిల్లలకేనా - ?
వీపు నిమరటంలో ఇంత కుట్రుందని
మాకిప్పుడిప్పుడే అర్థమవుతోంది - !
మా భవిష్యత్తుని నరికిపాయ్యే కత్తులిట్లగూడ ఉంటయని
మేమేనాడు ఊహించలేదు -

*

అందమైన లోకాల్ని అల్లుకోవటం ఎక్కడా నేరం కావొద్దు
స్పష్టంకాని ఆలోచనని విప్పార్చమని కోరటం దోషమనిపించుకోవద్దు
మోయలేని పుస్తకాల బరువు ఎలాగూ మా వీపుల మీద
ఇక మా మెదళ్ళమీద భయపెట్టే మీ ఏనుగుపాదాల్ని మోపకండి...
మేం పిల్లలమే - తప్పటడుగులుంటాయి
చేయి పుచ్చుకు నడిపించండి !
జీవితాన్ని కొత్తగా అధ్యయనం చేయించటానికి రండి !!

*4-5-95*

# బషీర్‌బాగ్

కందుకూరి శ్రీరాములు

ఫ్లై ఓవర్ ఆవరణలో
నీ పేరు హత్యాక్షరమై లిఖించింది చరిత్ర
ఓ బషీర్‌బాగ్ ! నువ్వో జలియన్‌వాలా బాగ్ !!
నీ దేహం కబేళా మీద కళేబరమై వేలాడుతుంది

నాలుగురోడ్ల కూడలిలో
నల్లటి రక్తపు మరకలు
సింహాసనాన్ని సింహావలోకనం చేసుకోమంటున్నాయి
నీవెవడికింద జీతగాడివైనావో
నీవెందుకింత లెక్కల పుస్తకం తెరిచావో, – అని

రొమ్ము చరచి కాల్చండిరా అన్నాం
గుండుకు ఎదురు గుండె పెట్టాం
గుండెల్ని పేల్చాడు వాడు
గుండె పగిలిన నేల అగ్నిగుండమైంది

ఎదురు తిరగక ఎన్నాళ్ళయ్యిందో
పుట్టుకతోనే పుట్టిన జ్ఞానమది
ఎర్రజెండా లెగరక ఎన్నేళ్ళయ్యాయో
వీధులగుండా – రోడ్ల గుండా –
దండెం వేలాడదీసినట్టు
రోడ్డు నిండా ఎర్రనాలికల జెండాలే
కదనానికి కాళికలైనాయి



ఎర్ర రంగుల్లో ఏముందోగాని
అన్ని హంగులూ దానివే
పొద్దు పొడుపోలె కన్పిస్తే చాలు
తోబుట్టువు రంగులూ
తొండాల ఏనుగులూ దద్దరిల్లుతాయి
తుపాకులూ మీవే తూటాలూ మీవే
అశ్వాలూ మీవే బాష్పవాయువులూ మీవే
రాళ్ళూ మీవే లాఠీలూ మీవే
సహజసిద్ధమైన కాళ్ళూ కళ్ళూ మావి
చేతులూ చెవులూ ముక్కూ మూతి ఇవే మా డాలూ కత్తి
ఊరేగింపును ఉత్తుంగ తరంగాలను ఎవడాపగలడు ?
ఎత్తైన తీరాన్ని
అసెంబ్లీ ద్వారాన్ని ముంచేయగలవు !!

*11-9-2000*

# పెనుగులాట

నందిని సిధారెడ్డి

ఒగ బాధకాదు
ఒగ దుఃఖం కాదు
రాగి చెంబుకంటే సులువుగా
జీవితం తాకట్టు పడుతుంది
బీర తీగంత సుతారంగా తీగవారిన మనసు
వాడిపోతుంది

తేనెటీగలు బజారుపాలయి
తేనెలేని తుట్టె తెల్లగా వేలాడుతుంది
వంటింట్లో ఏమీ మిగలనట్టే
వంట్లో ఏమీ మిగలదు
సానలేని డొల్ల మటుకు
అట్నుంచిటూ ఇట్నుంచటూ సొలుగుతూ డొల్లుతుంది

ఉన్నతమైన ప్రేమలల్లు కోవాల్సిన ఇంట
ఊసులు బంతిపూల సొగసులు కావాల్సిన ఇంట
అన్యోన్య పరిమళాలు ఆకాశాల్ని కుదపాల్సిన ఇంట
కాపురం వికృత క్రీడా విశేషమైంది
ఒగ కత్తికాదు
ఒగ వేటుకాదు
దెబ్బలూ పెడబొబ్బలతో
దేహాలు ఉడుకుతాయి
పంచుకునే సమయానికి
పాలు విరిగిపోతాయి



ఎగతాళి జీవితం పొడుగునా వ్యాపిస్తుంది
ఎటుపక్కకు పొర్లినా
అప్పు పల్లేరుగాయలా గుచ్చుకుంటుంది

ఒగ మోసం గాదు
ఒగ దుర్మార్గం గాదు
రౌడీ కిరీటాలు ధరించి
కాంట్రాక్టు దేవుళ్లు కార్లు దిగుతారు
కలెక్టరాఫీసులో
కన్నీటికి వేలంపాట పాడుతారు
గొప్ప తెలివితేటలన్నీ గొప్ప గొప్ప చదువులన్నీ
రెక్కల కష్టం కొట్టడానికి సరికొత్త వలలు వెదుకుతాయి

సూర్యుడుదయించాల్సిన తెల్లవారుజాము
కష్టజీవి అమాయక ముఖమ్మీద
సారా పొట్లం ఉదయిస్తుంది
రక్తం ఉరకలెత్తి ఆత్మ పులకించాల్సిన శరీరం
సారాయి చెక్కర్లతో బోలుపోతుంది
అలసిన భార్య కనిపించదు
అలమటించే పిల్లలు కనిపించరు
సువిశాల ప్రపంచమంతా కుదించుకుపోయి
సారా పొట్లంలో సాక్షాత్కరిస్తుంది
ఎంత వేటాడినా దొరక్కుండా
ప్రభుత్వం సారాయి సీసాలో తలదాచుకుంటుంది
జీపుల్లో స్వర్గాన్ని తరలించి
గ్రాముల చొప్పున
గ్రామాల్లో దుకాణం పెట్టి అమ్ముతుంది
కాదంటే
పోలీస్‌స్టేషన్లో తుపాకులు పట్టి అమ్మిస్తుంది

పని అడక్కుండా తిండి అడక్కుండా
బలవంతంగా నోరు తెరిపించి
ఇంత సారా కుక్కుతుంది

ఒక రాజ్యం గాదు
ఒక హింసగాదు
సారా వాసనల గుబాళింపుల ముందు
ఓటు ఓటిదవుతుంది

కాంట్రాక్టరు వేలి ఉంగరం ముందు
శ్రమ విలువ కోల్పోతుంది
ఒకరోజు గాదు
ఒక అవస్థ గాదు
చీకటి చిత్రవెతల్లో శరీరదీపం ఆర్పుకుపోయింది
చీకటి నల్లగానే కాదు
రంగులు మార్చి తెల్లగా ఎర్రగా చామన్ఛాయగా విస్తరిస్తుంది

జీవితమంటే చీకటికి తలొంచటం కాదు
బట్టకట్టి మౌనంగా మరణించటం కాదు
వెలుక్కోసం వెతుకులాట
ప్రేమకోసం పెనుగులాట
మనిషి కోసం ఎడతెగని గొప్ప తండ్లాట

*10-10-92*



# దేశభక్తి

దాసరాజు రామారావు

ఆనందించు, అమెరికా
ఆనందించు !

నీ డాలర్ కాళ్ళ చుట్టూ
బొచ్చు కుక్కలా తిరిగేందుకు,
పతనమైన రూపాయి విలువ
అద్దంలో తన ముఖం చూసుకుంటూ
అసహ్యించుకొంటుంది

అనుబంధాల తాతలూ, తండ్రులూ,
తెలుగు తల్లి ముఖాన మెరుస్తున్న తేజస్సూ
నీ కాంటెస్సా కారు పక్కన
నిలబడలేక
తలలు దించుకొంటున్నాయి

నీ మీదికి గాలి మళ్ళిందంటే
మా వాళ్ళిక్కడ
నాలుగంకెల జీతాలకు పని చేయడానికి
బద్ధకిస్తారు
వైట్‌హౌస్ ప్రేమ కలాపాల పురాణాలు
విన్నాక
మా పురుషత్వాల మీద మాకు
నమ్మకం పోయి,
మీ వయాగ్రాల తాయిలాలంటే
నోట్లో నీళ్ళూరుతున్నాయి

నీ స్టైల్ చూశాక
మా వందేమాతర గీతాన్ని కూడా
నీ మెహర్బానీ కోసం
ఏ ఫారిన్‌లోనో కూర్చుని
గమ్మత్తైన బాణీలకై కసరత్తులు
ప్రారంభించినాం
'మీ ప్రోఖ్రాన్
నా కంటి ఎరుపుల విస్ఫోటనం కన్నా
గొప్పది కాదులే'

అని నువ్వు బీబీసి టీవంత
నోరు చేసుకొని అరచినప్పుడు,
'మాదీ ఒక దేశమేనా'
అన్న అనుమానం వచ్చో, రాకో
ఎటూ తేలని మనస్కులమై
వుండిపోయాం చూశావా !

'మెడబట్టి మీ భారతీయ
సైంటిస్టుల్ని గెంటేస్తాం'
అన్నప్పుడు కూడా
మేం పూసుకున్న వీరగంధం తాలూకు
స్ఫురణలేవీ
పొటెత్తలేకపోయాయి
ఇంతకన్నా నీకింకేం
'గట్స్' కావాలి అమెరికా !
నువ్వు విసిరే వీసా మన్మథ
బాణాలకు
మేం తాళలేకపోతున్నాం
ఇక్కడ
మా మలయానిలం,
మా వసంత కోకిల గీతాలూ,
మా శరత్కాల వెండి చంద్రబింబం
ఎంత మోటుగా వున్నాయో ?



గంజిలో మెతుకులు ఏరుకుంటున్న
మనిషి
ఇంకా మా దేశంలో
తిరుగాడుతున్నాడంటే
మా సంస్కృతేం ఏడ్చిందసలు ?
మువ్వన్నెల జండా ముడి
విప్పినప్పుడు
మా దేశభక్తి, పువ్వుల్లా
రాలి పడుతుంటుందిలే
వాటి మీంచే నడచి వస్తున్నాం అమెరికా,
నీకు షేక్‌హాండ్ ఇవ్వడానికి !!!

*29-3-1999*

# ప్రకృతి విరుద్ధం

*పోగుల రాజన్న*

ఓ చిన్న కురుపు నా గుండెని సల్పుతున్నపుడు
బ్రతుకుని ఛిద్రం చేసి – నల్లగుడ్డుతో తొంగి చూస్తున్నపుడు –
నా హృదయపుటద్దాన్ని నేలమీద గిరాటేసినపుడు –
పగిలిన ఒక్కో ముక్క బాకై నా శరీరాన్ని కోస్తున్నపుడు
ఏ గాయం గూర్చి చెప్పుకోను –
ఎవరు చేస్తున్నారని – ఎందుకు చేస్తున్నారని చెప్పుకోను...
రాత్రంతా చందమామని దాచేసి –
చుక్కల్ని కిటికీ ఊచలకి వ్రేలాడేసిన వాళ్ళ గూర్చా ?
పగటి కలలని మొఖాన్నేస్కుని తిరుగుతున్నపుడు
దయ్యాలెరగని ఊళ్ల కొంపల్ని కొల్లేరు చేసిన వాళ్ల గూర్చా ?
సాయం సంధ్య కెర్రబడ్డ ఆకాశం క్రింద –
రంగుమారిన నా తెలుపుచొక్కాని పీలికల్ని చేసినవాళ్ల గూర్చా ?
ఏం నేరం చేశాను బాబు!!
తూర్పొడ్డున సూర్యవందనం చేయడం తప్పా ?
ఇసుక రేణువులతో పిచ్చుక గూళ్లని కట్టడం తప్పా ?
ఆరుద్ర పురుగుల్ని అగ్గిపెట్టెల్లో దాచడం తప్పా ?
అడవి పొదలో దాగిన ఎర్రెర్రని గోగుపూలని ముద్దాడడం తప్పా ?
వేటగాడి తూటాకి బలైన పావురాన్ని పరామర్శించడం తప్పా ?
ఏం నేరం చేశాను బాబు...!!
నా కన్రెప్పల కింద సూదుల్ని గుచ్చారు ?
"నా మలద్వారంలో సీసాని కుమ్మారు ??"

వాళ్ల పాపాల్ని రోజూ ఆదారి గుండానే కదా వదిలేసేది –
ఎన్నెన్ని సీసాల్ని నింపి పరిశోధించుకుంటారో చేస్కోనియ్యండి !



నేను మాత్రం రోజుకు రెండుసార్లు – తూర్పు పడమటొడ్డున
రెండు కొండల మధ్య నిలబడి గావు కేకేస్తూనే ఉంటాను !
వాళ్ల పాపాల్ని వదిలేస్తూనే ఉంటాను !
ఎంతకాలం దాచుకోనూ ?
ప్రకృతికే విరుద్ధం కదా మరి !!

మార్చి 1994

# కాలాతీతులు

*ఐలేని గిరి*

ఎండలతో పిల్లలకేం పని ?
ఒక్క ఆటలోనే
వంద ఆటల్ని ఊహించుకుని
రోజంతా విసిగిస్తారు
కోపంతో సూర్యుడు కొట్టిన
వడదెబ్బకి ముఖం వాడిపోయినా
బయటి కేరింతలు వింటే చాలు
నీరసం నిముషాల్లో పరార్
మళ్ళీ ఆటలకు తయ్యారు

వరదలతో పిల్లలకేం పని ?
కట్టెపుల్లల్తో కాగితప్పడవల్ని కదిలిస్తూ
మోరీల వెంట సముద్రానికి దారులు కనుగొంటారు
కావాల్సినంత ఖాళీ దారి వున్నా
కాళ్ళతో వర్షపు నీళ్ళని చిమ్ముకుంటూనే నడుస్తారు
జలుబు వస్తేనేం
వర్షం మళ్ళీ రాదుగా !

శిశిరం వస్తే చిన్నారులకేం వణుకు ?
మంటల్లోకి ఎండుపుల్లల్ని విసురుతూ
వాటి టపటప శబ్దానికి
టపాకాయల్లా ఎగిరి గంతేస్తారు
చలిపులితో యుద్ధంలో
గెలుపు మాదేనంటారు



ఆటవస్తువులు కొత్తవైతే చాలు
అర్థరాత్రి దాకా ఆడీ ఆడీ
వాటి పక్కనే అలిసి పడుకుంటారు
సూర్యుని కన్నా ముందే లేచి
మళ్లీ వాటితోనే ఆట మొదలు –

సమయా సమయాలు వాళ్ళ దినచర్యలలో లేవు
సాధ్యాసాధ్యాలు వాళ్ళ సిలబస్‌లోకి రావు
వాళ్ళు మేధావులు సుమా !
పొరబాటునైనా కదలించకు
వాళ్ళు పిల్లలు సుమా !
కసుర్లతోనో చేతి విసుర్లతోనో వాళ్ళని కట్టెయ్యకు

నీకో రహస్యం చెప్పనా !
వాళ్ళకో శాపముంది
స్కూలు పేరు చెప్పావో
నీళ్ళు నములుత్తా నీ కళ్ళెదుటే
శిలలైపోతారు

# అమ్మకు క్షమాపణలతో...

దాసరాజు రామారావు

నిలువెత్తుగా ఎదిగిన అమ్మముందు
మరుగుజ్జంత నేను పూర్తిగా ఓడిపోయాను
............ ............ ............

బతిమిలాడుతూ గోరుముద్దలు తినిపించిన
అమ్మ చేతులతో,
ఇప్పుడు పాచిపని చేయించుకుంటున్నాను

బడి నుండి రాగానే నన్ను చూసిన
ఆనందంలో మిలమిల మెరిసిన
అమ్మ కళ్ళలో,
ఇప్పుడు కన్నీటి ముండ్లు మొలిపిస్తున్నాను

తొమ్మిది మాసాలుగా కడుపులో దాచుకొని
ఎనలేని కడుపు తీపిని పంచిపెట్టిన
అమ్మ జానెడు పొట్టకు
రుచుల్ని పరిచయం చేయలేకపోయాను

జోలపాడి, ఊరడించి, నిద్రపుచ్చిన
అమ్మ నోటికి
'వాగొద్దు' అని తాళం పెట్టినాను
కంటికి రెప్పలా కాపాడుతూ నన్ను పెంచిన
అమ్మనిప్పుడు,
నా ఇంటికి కావలి కుక్కను చేసినాను



నా బతుక్కి బంగారుబాట వేసిన
అమ్మ
నా కుటుంబ వ్యవహారాల్లో తలదూర్చి
సలహాలివ్వబోతుంటే
'చాదస్తపు' 'ముసల్ది' అని కసురుకున్నాను
రాగద్వేషాలు అంటకుండా నన్ను సాకిన
అమ్మ
ఇంటి కోడలిని 'సాధిస్తున్నద'ని అనుమానపడ్డాను

నా పిల్లలకు
చాకిరి యంత్రంలా, ఆట వస్తువులా
వాళ్ళు తిట్టినా, కొట్టినా
అరవలేని వృద్ధ గడియారంలా
వుండిపోయిన అమ్మను
మౌనంగా చూస్తూ వుండిపోయాను

అనర్గళంగా చెప్పిన కథను చెప్పకుండా
రాజుల కథలు, దయ్యాల కథలు
నాకు చెప్పిన అమ్మ
నా సంతానానికి చెప్పే అవకాశమివ్వకుండా
రంగు రంగుల ఛానల్స్‌ని ఇంట్లో కొనిపెట్టాను

నాన్నకు తద్దినం పెట్టినరోజు
'ఒక లీవ్ పోయిందే
ఆదివారం వస్తే బాగుండు' అన్నప్పుడు,
నాన్న ప్రతిబింబమున్న అమ్మ మనసు
ఎన్ని ముక్కలై ఉంటుందో ఊహించలేకపోయాను

ఆనాడు అమ్మ ఇల్లంతా దేవతలా
కలియ దిరిగితే,
ఈనాడు పిల్లిలా బెరుకు బెయిగ్గా
తిరుగుతూ
అందరూ దూరం కొడుతుంటే
ఏమీ చేయలేకపోయాను
నాకోసం ఒక జీవితకాలం

శ్రమించిన అమ్మ దగ్గర
పట్టుమని పది నిమిషాలు కూచొని,
ఆమె మనసును మునివేళ్ళతో నన్నా
కళ్ళ కద్దుకోలేకోయాను

ఇంత చేసినా
నన్ను ఇప్పటికీ
'అడ్డాల నాటి బిడ్డవే'రా
అంటుంది అమ్మ
'అందరి ముందు గెలవాలిరా'
అన్నవి అమ్మ మాటలు -

ఒక్క అమ్మ ముందే
గెలవలేకపోయాన్నేను !

*26-5-2000*



# యుద్ధ భయం

**మహమూద్ పాషా**

యుద్ధం ఎప్పుడు తుఫాన్ ముందు నిశ్శబ్దంగా
ప్రశాంతంలాగే ఉంటుంది
యుద్ధం ఏ క్షణం ఎప్పుడు జరుగుతుందో తెలియదు
దేశ సరిహద్దు పై భయం నీడలు పర్చుకొంటాయ్
అధికారం, అర్థబలం, మతం, ఉగ్రవాదం,
యుద్ధ మేఘాలై ముసురుకొంటాయ్
దేశాల నిండ నిస్సహాయ దుర్భర జీవితాల నిండా కల్లోలం !

పుత్తిలోని విషపూరిత ఆలోచన్లా -
భూగోళం మీద విధ్వంసం సృష్టిస్తున్నప్పుడు
మనిషిలో మానవత్వం మౌనంగా ప్రవహిస్తూనే ఉంది
జీవించే హక్కు కనుచూపు మేరలో
కష్టాల కాష్టంలో కాలుతున్న శవాలు వాళ్ళు -
కనబడుతున్న సత్యాలు -
ఇసుకదిబ్బలు, బండరాళ్ళు, గుట్టల దేశంలో
జీవించడం యుద్ధమైపోయింది
ముక్కుపచ్చలారని పసిపాపలు మొగ్గల్లో
రాలిపోతున్న దృశ్యాలు
ముల్లే మూటలు నెత్తికెత్తుకొని వలసపోవడం సహజమే!
ఆకలి, రోగాలు కాటువేస్తాయ్
ఉగ్రవాద యుద్ధభయం నరాలను వణికిస్తూనే ఉంది.
యుద్ధం ఎప్పుడు జరుగుతుందో
తెలియదు పాపం ! వాళ్ళకు

యుద్ధ విమానాల బాంబు దాడులు
భయం భయంగానే ఉంటుంది.
స్వదేశం వదలి కుటుంబాలకు కుటుంబాలు
వలస పోవడం సహజం !
యుద్ధ బెదిరింపుల్లో ప్రాణాలు ఎవ్వరికైనా తీపి కదా !
ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకొని
సురక్ష ప్రాంతాలకు పక్షుల్లా వలసపోవడం సహజమే !
చరిత్ర సాక్షిగా దుఃఖితుల ముఖాల మీద
దేశాల మధ్య శత్రుత్వం ఛాయలు
కన్నీటి చారికలే సుమా !
రాత్రి పగలు ఒకటే నరకయాతన
యుద్ధ విమానాల విన్యాసాల హోరు
కాలం రాతి గుట్టల మధ్య గిజగిజ తన్నుకొంటూనే ఉంది
జనం వలసపోతున్నారు దేశ సరిహద్దులు దాటి
ముళ్ళకంచెలు దాటి
ప్రమాదం ఎక్కడ ఎక్కుపెట్టబడియుందో !
పాపం ! వాళ్ళకు తెలియదు
పుట్టిన గడ్డ మీద ఇల్లు వదలి
ఆవులు గేదెలతో మేకలు గొఱ్ఱెలతో
వలస పోతున్నారు జీవన తీరంవైపు !



# తెగింపు

ఏలేశ్వర నాగభూషణాచార్య

భరించలేని అవమానాల ఖాకీల జులుంలో
తెలుగుపల్లె కకావికలై ఎదపై లబోదిబో గుద్దుకుంటూ
తలమునకలై తల్లడిల్లుతుంది
తెల్లారీ తెల్లారక ముందే బతుకు బండిని సాగదోలుకుంటున్న
వలసల నేపథ్యంలోనే పల్లెలకు పల్లెలన్నీ ఖాళీ...
బుడ్డగోచి లేని బుడ్డపోరడు మాయమవుతుండు
అవ్వసంకల కెళ్ళి సంటిపోరి ఏడ్పు మటుక్కున మాయమవుతుంది
ఎక్కడెక్కడని గావుకేకేసి ఎక్కిళ్ళు పట్టేడ్చిన
అవ్వ ఆరోప్రాణం ఆవిరైపోతుంది
ఇవాళ తెలంగాణ పల్లెల్లో అమ్మ ఆఖరి చూపు కరువైపోతుంది
తెలంగాణ వీరోచితమైనదే
చరిత్ర పుటల ఆనవాళ్ళ సాక్షిగా నెత్తుటిధార మీద
గతించిన చరిత్రను నెమరేసుకున్నదే ! నెమరేస్తున్నదే !!
ఇక్కడ మొన్న మొన్న మొలచిన నెత్తుటి బిడ్డ సైతం
అమరుల త్యాగాల తెగింపు గూర్చి
ఆవులింతలతో పుక్కిలించగలడు
బావురుమని గీపెట్టే బరిబత్తల పసి పోరగాడు
తెలంగాణ భవిష్యత్తు చిత్రపటం మీద
తీయతీయని పాటల్ని పాడగలడు
కాని ?! తెలంగాణ పల్లెల కన్రెప్పల మీద ఆవగింజంత కునుకులేదు
ఏ క్షణాన ఏ సవ్వడో ?! ఏ క్షణాన ఏ రువ్వులో ?!!
అంతా మొగులైనట్టు మెదళ్ళు మొద్దుబారిన దృశ్యం
తొట్టె లూగుతున్నట్టూ పల్లెలూగుతున్న ప్రకంపనాలు

ఏమైనా మొగులుతెప్పల్ని ఆలోచనాఖడ్గంతో చీల్చేసుకుని
ఊరూవాడా పొలిమేర్లు సైతం తెలంగాణా నినాదానికి
లక్షల గొంతులు ఏకమై దరువందిస్తున్నాయి
ఎంత తెగింపుదనం తెలంగాణాది ?!
పచ్చని పైరుపంటల పచ్చల్ని పొదిగిన
తెలుగు తల్లి ఒడ్డాణం మీద నెత్తుటి మరకలే
నిలువెత్తు చారికలయ్యాయి
తెలంగాణా మీద చిమ్మిన వీరుల రక్తం మరిగి మరిగి గడ్డకట్టి
ఇవాళ తెలంగాణ మహా వ్రణమయ్యింది
రేపు బుజబుజై చీము కారుతుంది
కారిన ప్రతి చీము చుక్క ప్రజా తెలంగాణా గూర్చి
పాటలు పాడుతుంది పాఠాలు నేర్పుతుంది
నెర్రలు బారిన బీళ్ళ మీద నెత్తుటి బొట్లు రాలి
పచపచ్చని గడ్డి మైదానాలని మొలిపిస్తాయి

*23-5-2001*



# టార్చర్

*అలాజిపూర్ కిషన్*

పన్నెండు గంటల రాత్రి
ప్రాణమొక్కటి పాడెపై ప్రయాణిస్తుంది
చంద్రుడు సగం తెగి ఆకాశం చీకటి పడుతుంది
మట్టిలోకి నీటి ఊట మాయమౌతుంది
వాడ వాడంతా యుద్ధ సన్నివేశం
జీవితం కూడా నిషేధమే
నిద్ర కూడా నిషేధమే
రాత్రి అంతా నిషేధమే
తలుపులపై లాఠీలతో కొట్టగానే
గుండె కలుక్కుమంటుంది
మాట రాక, కాళ్ళు కదలక
నిశ్చేష్టులమవుతాం
ముఖాలన్ని విషాద భరితాలవుతాయి
అక్షరం వెక్కివెక్కి ఏడుస్తుంది
ఆయుధం భూమిలో
తనువు చాలించనంటుంది
ఎవడి సుఖం వాడిదే
ఎవడి దుఃఖం వాడిదే
ఎవడూ తన సుఖాన్ని ఇంకొకడికి పంచడు
ఇంకొకడి దుఃఖాన్నెవడూ పంచుకోడు

చరిత్ర చదివినందుకు
చెరసాలల పాలవుతాం
చరిత్ర గీస్తున్న చేతులు కాకీబూట్ల కింద నలుగుతుంటాయ్

సూర్యుడి జాడ చెప్పమని
నా వీపుపై నిప్పులు గుమ్మరిస్తారు
ప్రజల్లో ప్రాణమైన పాల కోసం
నా పాదాలు నెత్తుటి ముద్దలౌతాయి
నా దేహం నిండా గాయాల కళ్ళే
చేపపిల్ల ఏదనీ చందమామ ఏదనీ
తమ్ముడేడనీ తుడుం ఏదనీ
టార్చర్ ! టార్చర్ !! టార్చర్ !!!
సముద్రంలో చేపపిల్లని
వీడు పట్టుకోగలడా
ఆకాశంలో చందమామని వీడు కొట్టగలడా
జనం ప్రతిబింబమైన తమ్ముణ్ని
వీడు పొల్చుకోగలడా ?
తుడుం శబ్దాన్ని శబ్ద చలనాన్ని
వీడు కనిపెట్టగలడా ?
తమ్ముడేం చేసి వుంటాడు ?
రేపు వికసించే పూలచెట్టుకు
నీళ్ళు పోసి వుండవచ్చు
ముళ్ళపొదలో మల్లె తీగల్ని
అల్లి వుండవచ్చు
తూరుపు పడవలో హైలెస్సా
పాటయ్యుండవచ్చు
ఇప్పుడు తమ్ముడెక్కడున్నాడని చెప్పను ?
భూమి పొరల్లో మందుపాతరైనాడని చెప్పనా ?
గోడపై అక్షరమై ప్రశ్నిస్తున్నాడని చెప్పనా ?
కూలన్న గిన్నెలో మెతుకైనాడని చెప్పనా ?
భూమి సముద్రం ఒక్కటైన చోట
ఉదయిస్తున్నాడని చెప్పనా
ఎక్కడున్నాడని చెప్పను
టార్చర్ ! టార్చర్ !! టార్చర్ !!!
జీవితాన్నివ్వని దేశానికి
చంపటమొక్కటే చేతనౌను



గుడ్డలివ్వని దేశానికి
నగ్నంగా ఊరేగించటం చేతనౌను

చరిత్ర నిండా చేదునిజాల జ్ఞాపకాలే
చరిత్ర గీస్తున్నవాడే వీరుడు
టార్చర్ ! టార్చర్ !! టార్చర్ !!!
రేపటి బాలుడు
మీ లాఠీల్లోంచి, రోకళ్ళ నుంచి
స్టెన్‌గన్‌ల నుంచి పుట్టుకొస్తాడు
వాడికి నువ్వూ స్వాగతం పలకాల్సిందే

# శబ్ద శరీరం

కందుకూరి శ్రీరాములు

కలం వాడు
కన్ను మీద రాస్తున్నాడు
నడక వాడు
గుండెల్లో పొర్లుతున్నాడు రెక్కల్లేని పక్షయి -
ఎంతైనా కాలివేళ్లు చేతివేళ్ళవుతాయా !
కాలిచెంచాను అన్నం ముద్దలో గుచ్చి
నోటిగిన్నెకు అందించిన వాడిది ఇది ఏ ఆసనం ?
భుక్తాసనాన్ని ఎవడూ చేయంది వాడు చేస్తున్నాడు
పాఠ్యపుస్తకాలు సర్ది చంకల్లో దూర్చేవి కాళ్ళే
కాలివేళ్ళు చేతి వేళ్ళయి
కలంలో రీఫిల్ చేసి మరతిప్పి
కాగితంమ్మీద అచ్చేయటం ఎంత గొప్ప సాధన !
వాడు గోడ మీద పరుగెత్తినప్పుడు చూడాలి
సాగదీసి సమతుల్యం చెడిపోని
తీగెమీద స్తంభం నడిచినట్టుంటుంది
వాడి రెండు భుజాలకు రెండు మర్రి ఆకులు
వేలాడుతున్న హస్తాలై విన్యాసం చేస్తూ
మొహం మీద ముసిరే ఈగల్నీ దోమల్నీ పారదోల్తాయి
కాగితాన్ని కాలితో తాకొద్దనీ
పెద్దలకు చేతులెత్తి నమస్కరించాలనీ,
క్లాసులో చెప్పిన పాఠానికి
వాడి కాళ్ళే చేతులై నమస్కరించినప్పుడు
గురువుగారి కోపం చింతబరిగయ్యేది



వాడెట్లా పరీక్ష రాసేది? వాడెట్లా నమస్కరించేది ?
వాడికి తినటం రాయటం బొట్టు పెట్టటం కాళ్ళే
వాడు చేస్తున్న పనులు ఎన్నో - ఎన్నెన్నో....
అవన్నీ ఏమోగాని -
నిండైన హాస్యసభలో నవ్వుల జల్లులు కురిసినపుడు
అందరి కరతాళ ధ్వనుల మధ్య
వాడి భుజాలకు వేలాడుతున్న
కుక్క చెవుల చేతులు టపటపలాడినప్పుడు
అప్పటి వాడి సంతోషం
మనకు దుఃఖంగా,
అప్పటి వాడి ఆనందం
మనకు అంతర్మధనంగా మారకపోతే
అసలు మనం మనసులున్న మనుషులం కాదు

28-7-1992

# పాటలు కావాలి

*యం.డి. అహ్మద్*

మళ్ళీ మొదలయ్యింది
దేశ రంగస్థలంపై
బహురూప ముఖాల భాగోత తంత్రం
అమెరికా అప్పుల సమ్మోహన రాగాలతో
పోటాపోటీగా రంగురంగుల్ని
పులుముకున్న సర్కస్‌ఫీట్లు
మళ్ళీ మొదలవుతున్నాయి
స్వదేశీ బ్రాండ్ కాషాయ పేల్కలు
పసుపు వన్నెల రెపరెపలు
నక్షత్రాల జెండాకు
కుచ్చుకుళ్ళాలు అవుతున్నాయి
జెండా రంగులు ఎన్నైనా
ఆలోచనల రొంపంత ఒక్కటే
స్వర్ణోత్సవాల జాతర పరదాలు
పర్చుకున్న ముసలి నక్కలు
అగుపించని యవ్వనాల
లేపనాలు రుద్దుకుంటున్నాయి
ఎండమావి పొరల్లో వెలుగు జిమ్మే
భారత సార్వభౌమాధికార నాలుగు తలల సింహాన్ని
ఆర్థిక, సాంకేతిక సంస్కరణ డేగలు
మునిగోళ్ళతో తన్నుకపోతున్నాయి
ఇంటర్‌నెట్ టెక్నాలజీ
భ్రమల కుతి తీర్చుకోవడానికి



తెలుగు ఆత్మాభిమానాలు
బిల్‌గేట్స్ ముళ్ళపాదాలకు తాకట్టులవుతున్నాయి
అమెరికా ఫోబియా సంకర ఆలోచనా తెంపరలలో
ప్రజల చెమట బిందువులు
కడగళ్ళ కన్నీళ్ళు "సీవరల్డ్" చిత్రాలైనాయి
చిగురించే బాల్యాల సాక్షిగా
"డిస్నిలాండ్" భూతాలు వెంటాడుతున్నాయి
అంతర్జాతీయ కుబేరుని కనుసైగల్లో
జనం గొంతులకు ఉరిచిచ్చులు బిగుసుకుంటున్నాయి
మనం ఇప్పుడు......
సరికొత్త నాజుకైనా కత్తుల వంతెనల
సంధికాలంపై నిలబడ్డాం
మన ఆలోచనా తుఫానులన్నీ ఏకం కావాలి
మనం జీర్ణించుకున్న అనుభవాల వంతెనలన్నీ
సమూహ గొంతుల సమరం కావాలి
భవిష్యత్తు చరిత్ర పుటల్లో
మన త్యాగాల గొంతులు
జనం పోరాట పాటలు కావాలి

# గుడిమెట్లు

మోతుకూరి అశోక్‌కుమార్

ఏ దేవుడు పురమాయించాడో గాని
వదులై నలిగిపోయిన ఓ కత్తులబోను మళ్ళీ పాడుచుకొస్తోంది -
సంప్రదాయాల ముసుగు పరదాల కింద
బతుకుని నిత్య నైవేద్యాల హారతి పళ్ళాన్ని చేసి
ఊయలూపటానికి రబ్బరుబొమ్మల అన్వేషణ -

*

బతుకు మార్గాలన్నీ కూరుకుపోతున్నాయని
కసాయి కత్తుల కింద రోజులవారీగా తెగిపోతామా ?
అంగవిన్యాసాల కళాకేంద్రమై
వారసత్వాల గాయపు పూమొగ్గలవుతారా ?
బోనులో కెక్కటానికైనా ఇక్కడ అర్హతలు కావాలి -
గాయపడటానికైనా నాజూకు రూపలావణ్యం కావాలి -
జగన్నాథుడు మీ నాథుడు కావటానికి ఇంటర్వ్యూలున్నాయంట -
హాజరవుతారా.... ?
చిలక కొట్టని పండై...
ఏ గాయమూ అంటని వాళ్ళై...
నోరూరించే రసగుల్లాలైరండీ - !
దేవుడు మెచ్చాలి... దేవుడి మనుషులు మెచ్చాలి !!

*

మన అమాయకత్వాల మీద... అసహాయతల మీద
తరాల నుండి పేనుతున్న కుట్ర



కొండ చిలువలా పాకుతూనే వచ్చింది -
పట్టు విడుపుల నిశ్శబ్దాల మధ్య నీవాళ్ళు
ఎన్ని వెన్నెల రాత్రుల నిర్జీవ శకలాలయ్యారు - ?
బరువుల్ని మోసీ మోసీ
అరిగిపోయిన బండి యిరుసులై ఒరిగిపోలేదూ ?
మేలుకొలుపుల జావళీలు -
పవళింపు సేవలు -
హారతి పళ్ళెంలా మీరు -
వెండి తళుకుల పూలపానుపుపై
కన్నీటి పూవులా జారుతూ... రాలుతూ... ?!
వద్దు... వద్దు... ఈ బోనులో కెక్కద్దు -
గాయాల అలంకారాలు తగిలించుకోవద్దు...
నమ్మకాల గాడిపొయ్యిలో చెరుకుపిప్పిలా బూడిద కావొద్దు...
బలమైన తెలివిగల్ల నాలుగు చేతుల మీద
అల్లుకున్న పంజరం ఈ బోను - !
దాసీలుగా తలవంచి కొత్త మెట్లై మరింత పైకెక్కించకండి
ఇప్పటికే వాళ్ళు దేవుళ్ళు -
ఎన్ని మహిమల స్వర్ణపంజరాల్నయినా పుట్టిస్తారు
బోను 'లోనికి' కాదు
ఈ బోనునే కూలదోయటానికి రండి - !!

11-9-1995

# ఖాళీలను తొక్కేస్తూ...

*వేముగంటి మురళి*

పట్టుకుందామంటే
చేతికి దొరకడంలేదు
గాలిని ఛిద్రం చేస్తూ
చెవిలో రొదపెడుతూ
శరీరంలోని పొంగుకొస్తున్న స్వప్నాల్ని
అడ్డుకట్ట వేస్తున్న జోరీగ
అనుకుంటాంగానీ
మన ఆలోచనల్ని మనమే నరికేసుకొని
ప్రపంచాన్ని పరిశీలిస్తున్నాం
చేతివేళ్ళ గాయాన్ని
ఒక్కసారైనా చూడకుండా
దిక్కులు చూడటం అవివేకం
అందరూ తీక్షణంగా
ఒకే మార్గాన్ని ఎంచుకుంటే
మన చెవిలో జోరీగ
ఎట్లా చేరుతుంది
అన్నింటిలోకి తొంగి చూస్తూ
ఏమీ కనబడటం లేదని భ్రమపడతాం
చూస్తున్న కళ్ళలోంచి
నీళ్ళు రాలితే చాలు
ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకున్నట్టే



మనకు అవసరం లేని
రెండు వస్తువుల యుద్ధంలో
మనిషి సరుకవుతున్న సన్నివేశం
బిగిసిన చేతుల్ని
సులువుగా విడగొట్టటం కోసం
దిగుమతవుతున్న పోస్ట్‌మాడర్నిజం
నల్లని కంటిపొరల మధ్య
రంగుల ప్రపంచ మాయాజాలాన్ని
అతికిస్తున్న గోల్‌మాల్ గ్లోబలైజేషన్
ఎవరూ అతీతులు కారు
అందరూ ఎక్కడో, ఏ మూలలోంచో
అంధకారం లోంచో, నిశ్శబ్దంలోంచో
వస్తువుల గోడలకు అతుక్కుపోతూ
ఇనుప బీరువాల్లోనే
సిద్ధాంత గ్రంథాలకు తాళంపడిపోతుంది
చీకటి దుప్పటి కప్పుకొని
మిధ్యావాదాన్ని ప్రచారం చేసేవాళ్ళు కొందరు
మిత్రుల కలయికలు
ఆత్మీయ కరచాలనాలు లేవు
ఊహిస్తున్న ఖాళీలలో
మనుషులతో ఎవరో
తొక్కుడు బిళ్ళలాడుతున్నారు
అన్నింటినీ చూస్తూ
మనసును అదిమి పెట్టుకోవటం
చాలా కష్టం...

*

నిశ్శబ్దం! నిశ్శబ్దం!
ముందొచ్చే కాలాన్ని అదిమి పెట్టడానికి
ఇనుపపాదం భూమిలో నాట్లేసింది
అయినా మనం నిశ్శబ్దం!
ఉద్యమాల ఊపిరి తియ్యడానికి శత్రువు
వలలు పన్నుతున్నాడు

భయంకర శబ్దంతో
శత్రువు ముందుకొస్తున్నప్పుడు
మనం గాఢ నిశ్శబ్దంలోకి జారుకుంటున్నాం
ముచ్చట్లన్నీ
ఇరానీ టీ కప్పుల చప్పుళ్ళ వరకే
మాటలన్నీ పెదవుల కొసలవరకే
మనుషులు
అడుగు తీసి అడుగేస్తే
సంక్షోభంలోకి కూరుకు పోతున్నప్పుడు
భూమి మీద నిలబడి
మంచి మాటలు మాట్లాడటం కష్టం

*

నిశ్శబ్ద సంక్షోభాన్ని ఛేదిస్తూ
ఒక్కొక్కరూ మెత్తని పాదాలతో
నడుచుకుంటూ రావాలి
గుంపులు గుంపులుగా
ప్రవాహాలు ప్రవాహాలుగా
వీధుల్లోకి ప్రవహించాలి
ముక్కలు ముక్కలైపోయిన
విశ్వాసాలన్నీ ఒక్క దగ్గరకు చేర్చి
పునర్నిర్మించాలి.

మార్చి, 2000



# బందీకాని గొంతుక

దేశపతి శ్రీనివాస్

మా శిరస్సుల్ని తెగవేద్దామని
కత్తినెత్తావు నువ్వు
మా చూపుల జీవనదులు తాకి
కత్తికి కూడా శిరస్సు మొలుస్తున్నది
నీ బెదురు గుండె చప్పుడు
నీకు స్పష్టంగా వినపడుతున్నదా...
బలి చక్రవర్తి తల
భూమిని చీల్చుకుని పునరుద్భవిస్తున్నది
ఇనుపపాదం పాతాళానికి కూరుకుపోవటం
స్పష్టంగా కనపడుతున్నదా...
వనాల వసంతరాగాల్ని
బ్యారక్స్‌లో వేసి
జనం చెవులు మూసేద్దామనుకున్నావు
పంట కాలువలు పారించిన చేతులు
జైలు ఊచల్ని
పిల్లనగ్రోవులుగా పాడటం
నీ ఊహ కందటం లేదు కదూ...
అందరికీ అన్నం అడగటం
నేరం చేసి
చుట్టూ గోడలు పెట్టావు
అన్నం తినకపోవుడు
కూడా ఉద్యమమై

గోడల మీద పిడికిళ్ళు
మొలిచిన వ్యూహం
మతిపోగొడుతున్నదా...
జనం జ్ఞాపకాలే
అన్నలకు అన్నాలు
ఒలుకుతున్న కవిత్వ పంక్తులే
గొంతు తడిపే గ్లూకోజ్ నీళ్ళు
మోదుగాకుల్లో గొండు తల్లులు పెట్టిన
అచ్చురు బువ్వ తిన్న కడుపులవి
ఇప్పుడప్పుడే
వట్టిపోయి నీరసపడవు

చెరసాల పోరాటాల పాఠశాలగా
ఉరికొయ్య ఎర్రజెండాగా
అరదండాలు ఎర్రదండాలు
పెడుతున్న వైనం
అధివాస్తవిక సన్నివేశంలా
అంతుపట్టటం లేదవునా?...

వర్షం పడకూడదని
కంతలు మూసావు
నీ పిచ్చిగానీ
తడిసిన మనుషులు
టపటప రెక్కలు కొట్టుకుంటే
కరపత్రాలు జనంలో రాలుతున్నాయి
అర్థం కాలేదా ?

పొద్దున్నే వాలిన పావురాన్ని
మెడవిరిచి పరీక్షిస్తున్నావు
చిమ్మిన రక్తంతో
రెక్కల ముఖపత్రంపై
నీ కేరికేచర్ చిత్రించుకొని
ఆకాశంలో అనేక పావురాలు



హక్కుల్ని పాతేయటానికి
జైళ్ళు పెట్టావు
జైళ్ళు కూడా నోళ్ళు తెరిచి
హక్కులడుగుతున్నాయి
సమాధానం చెప్పు
జైలు బయటా, లోపలా
సముద్రాలు గర్జిస్తున్నాయి
నీ జలసమాధి దృశ్యం
కలలో కొస్తున్నదా

ఎవర్ని ఎవర్నుంచి
వేరు చేయగలవు నువ్వు ?
జైళ్ళలో మాత్రం
తెలంగాణా మట్టి లేదూ ?
ఎక్కణ్ణుంచైనా సరే
వాళ్ళు మట్టిలోంచి
విరుచుకుపడటం ఖాయం !
నువ్వు
నిర్జీవ దేహం కావటం ఖాయం !!

*జనవరి, 1995*

# వర్ధిల్లుతున్న ప్రజాస్వామ్యం

*కె. అంజయ్య*

పువ్వుల్ని నలిపేసి
తుమ్మెదలకు దారాలు కట్టి
క్రీడారాగం ఆలపించండి
చెట్లు మొదలంటా నరికేసి
మొక్కల్ని నాటి
హరిత విప్లవ నినాదాలివ్వండి

పశువధను యాంత్రీకరించి
గర్భోత్పత్తికి వీర్యకేంద్రాలు విస్తరింపజేసి
పాడిపంటలు వర్ధిల్లుతున్నాయని ప్రకటించండి
పథకాల పూలు చల్లి
ఆశల పల్లకీలెక్కించి
శంకుస్థాపన రాళ్లు ప్రసాదించండి

సమస్యలు ప్రజలకొదిలి
ఎజండాల్ని చించేసి
మైకుల్ని విరిచి విసిరేసి
అభివృద్ధి జపం చేయండి

గ్రామాన్ని ముట్టడించి
ఇళ్లను దిగ్బంధం చేసి
కొంపలకగ్గిపెట్టి
శాంతివాక్యాలు ప్రవచించండి
పావురాల్ని పట్టుకొచ్చి
చిత్రహింసించి ఆనందించి



గాల్లో ఎగరేసి ఎన్‌కౌంటర్ చేసి
అహింసా మంత్రం ఆలపించండి
దినవారపత్రికల కాంతలతో
కులాసాలు చేసుకొని
తిరోగమన భాగస్వాములై
మార్కెట్‌కు బాటవేయండి
తెల్లవారగానే
సూర్యునిపై గుడ్లురిమి చూడండి
రాత్రవగానే
చంద్రునిపై ఉమ్మేయండి
హక్కుల గురించి మాట్లాడొద్దు
భవిష్యత్తు కోసం కలలు కనొద్దు
రాజ్యహింసను వేలెత్తి చూపొద్దు
ప్రజల పట్ల సామ్యవైఖరి లేకున్నా
ప్రజాస్వామ్యం జిందాబాద్
అనండి
ప్రజాస్వామ్యం జిందాబాద్

7-11-1993

# లెనిన్ గాయం

తైదల అంజయ్య

గాయాన్ని పూడ్చినంత మాత్రాన
జ్ఞాపకం మానుతుందా ?
శవఖననం చేసినంత మాత్రాన
సిద్ధాంతం మూగదవుతుందా ?
మాటిమాటికీ ఎందుకూ
ఎన్ని జ్ఞాపకాలను తగలెయ్యగలవో చెప్పు
మేం పుస్తకాలను విడుదల చేస్తాం

సిద్ధాంతపు గాయం మీద
ఎన్ని ఎన్‌కౌంటర్లు చేయగలవో చెప్పు
మేం మా హిట్‌లిస్ట్ తయారు చేస్తాం
పూత పూయాల్సిన గాయం మీద
కారం పూస్తే మంట పుట్టదూ
సామాజిక చికిత్స అంటే
వ్యవస్థ చెడు రక్తాన్ని నిర్మూలించడం గానీ
శవ ఖననం చేసినట్లు గాదు
భౌతిక గాయమైతే బాగుండేదే
రసాయన గాయం కదా,
రగులుతుంది జాగ్రత్త !
భౌతికమైనా రసాయనికమైనా
చర్యకు ప్రతిచర్య మాత్రం
ఉండే ఉంటుంది
కాలానికి గిరిగీయగలవేమో చెప్పు
చైతన్యాన్ని చెరిపేయగలవేమో చెప్పు
గాయమెప్పుడూ భౌతికం కాదు
గొంతెప్పుడూ మూగబోదు
రూపం మారుతుందంతే !



# మా వూరికి కళొచ్చింది

పప్పుల రాజిరెడ్డి

మా వూరికి కళొచ్చింది
అద్భుతకళ - అపురూప కళ
రెక్కల కష్టాన్ని మాయచేసి - దోపిడీ చేసి
కూలీ బతుకుల్లో కుంపటిపెట్టి - నోట్లో మట్టిగొట్టే కళ
బహుళజాతి కంపనీల యినుప కళ - జేసిబి కళ
మా వూరికి కళొచ్చింది

*

ఊరిప్పుడు గాలానికి తగిలి గట్టుపై బడి
తల్లడం మల్లడం కొట్టుకునే నిస్సహాయ చేప బతుకు
దళారీల నరకంలో చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడే సందిగ్ధ దృశ్యం
వూరిప్పుడు గాయాల్ని పూచిన మోదుగ చెట్టు
మౌన నిర్వేదంలో చేతులు వేలాడేసి బీరిపోయిన శ్రమకు ప్రతినిధి

*

పంట పొలాల ధ్వంసం చేసి చేపల చెరువుల్ని ఉబికిస్తారు
రొయ్యల పంట వ్యామోహంలోకి అలవోకగా నెట్టేస్తారు
పెట్టుబడితో పాటు ఆందోళన పెరిగిపోయి దిక్కుతోచని స్థితి
దాపురిస్తుంది
కాసుల పంట పత్తియాదికొచ్చి కండల్ల మెరుస్తుంది
ఇప్పుడు చేపల చెరువుల్ని పొలాలు చెయ్యాలి
ప్రాణసమంగా పైరును రక్షించుకునే క్రమంలో
వ్యాపారుల ఎత్తుగడలు ఎరవేసి మభ్యపెడతాయి

నిలువెత్తు కాయకష్టం సాక్షిగా - పచ్చటి పొలం సాక్షిగా
వెన్నముద్దల్ని కాస్తుందనుకున్న పత్తి చేను పురుగుముట్టి
విలవిల్లాడుతుంది
దారి తెలియని బతుకు జాలలేని బొంగరమవుతుంది
విరక్తిరాయి తగిలి అన్నంకుండ చేను మధ్యలో పగుల్తుంది

*

ఊరిప్పుడు బతికున్న శవాల దుఃఖాల జాతర
హక్కుల్ని కోల్పోయిన మూగజీవాల దైన్యపు చూపు
పంట చేలో ఆత్మహత్యలు మొలుస్తున్నందుకు బాధ లేదు
వందలకొద్ది కుటుంబాలు పిట్టసోకాలౌతున్నందుకు బాధలేదు
వోటు బ్యాంకు దెబ్బ తిన్నందుకు కోలుకోలేనంత బాధ
కంటి తుడుపు సానుభూతి కష్టాల్ని గట్టెక్కించదు
రైతుల్ని ఆదుకోని ప్రభుత్వాలు బతకటమొక విషాదం
తిమ్మిని బమ్మిని చేసే బాపతుగాళ్ళ మాయలు వూరికి బాగా తెలుసును
నాగళ్ళ దుఃఖం పట్టించుకోని యంత్రాంగం చక్రం తిప్పలేదు
బలవంతపు చావుల్ని స్వాగతిస్తున్న రాజ్యం
వూరుకేమిచ్చిందనీ
రైతులకేమిచ్చిందనీ
పుట్టెడు దుఃఖాన్నీ
యింత అభద్రతనీ

14-12-1998



# దూదిపింజల్లా రాలే ఉదయం

వేముగంటి మురళి

కంటి రెటీనాపై కొత్త గోళం
మనుషుల ముఖాల నిండా
ఛానెళ్ళ మచ్చలు
చేతులు చచ్చుబడిపోయి
పనిముట్లు భూమిలో దిగబడి
స్కూలు బ్యాగులోంచి
ప్రపంచం ఇంకా... ఇంకా
కుంచించుకుపోతున్న దృశ్యం
ఏక్‌తారా తీగ ముళ్ళు పడిపోయి
గుండెకు గుచ్చుకుపోయి
పులకరించే ప్రకృతి దృశ్యాలు
టి.వి. స్క్రీన్‌పై
బోన్‌సాయి అవతారమెత్తినప్పుడు
మనుషుల ముఖాల నుండి
మినరల్ వాటర్ చొంగ
పేదవాని కష్టంలోముంచిన
వరిగింజ
వాడి భవనానికి అద్దకమవుతున్నప్పుడు
సూర్యుని ముఖం నుండి
మిరిండా, పెప్సీ, కోకాకోలాల వెల్లువ
మన మొక్కజొన్నలు
వాడి కండ్లకు బంగారు గొలుసులు
కట్టినప్పుడు

ఎండిన గొంతుకలపై
వేలాడుతున్న కార్న్‌ఫ్లేక్
అమ్మమ్మల అప్పడాలు నలిగినప్పుడు
మనమంతా
అంకుల్ చిప్స్‌పై వాలిన ఈగలం
మనం ఎందుకు లేబిళ్ళమవుతున్నాం
మనం ఎందుకు బానిసలమవుతున్నాం
వాడి గొడుగు నీడను
ఎందుకు పంచుకోవాలి
మనకు
అంకుల్ శ్యామ్ అంకుల్ చిప్స్ కాదు
మనల్ని
పరదాలా నాటేసుకునే గాలి కావాలి
భూమిలోంచి
బుసబుస పొంగే
చల్లని ఊటనీరు కావాలి
మనకు భళ్ళున తెల్లవారే
ఉదయం వద్దు
మెల్లగా ఒక్కొక్క కిరణం
జొన్న చేన్లపై దూదిపింజల్లా రాలే
ఉదయం కావాలి

*సెప్టెంబర్, 1996*



# బతకపోయిన బతుకు

*నందిని సిధారెడ్డి*

దారుశిల్పాల్లా నిలవడ్డ
మొండితుమ్మల కింద నుంచి
రుమాలు ధరించి పూర్వీకుడెవరో
నడిచిపోతున్న అలికిడి
మేకలు మేసి పోంగ మిగిలిన కొమ్మొలె
ఎండిపోయి గలగలలాడుతున్న మనసు
నడవకేమి
ఒక సూర్యకిరణం విరిగి
చెప్పుల్లేని అరికాలుకు గుచ్చుకొని మొత్తుకుంటది
కొద్దిసేపట్ల నెత్తురూ కన్నీళ్ళూ కలెగల్సి
రుమాలు నిండా జ్ఞాపకాలు

ఇరవయేండ్ల కిందననగా పాడువడి
పెంకలు లేచి
పెండెరాలి
కూలికూలి
గడుసుగా నిలవడ్డ మొండిగోడల పక్కల
నిన్నట్నుంచి సంచరించిండు
మట్టిగప్పుకున్న చిక్కుల దువ్వెన ముక్క చూసి
ఉట్టి దిగని రంగుమారిన రిబ్బెన చూసి
కన్నీళ్ళు దాచి రోదిస్తున్న చాటపట్టె చూసి
అతను తట్టుకోగలడా...

కార్తులు కార్తులుగా
చెట్ల చేతులకు పచ్చబొట్టు పొడిచే పురాస్మృతులు
పూదిచ్చిన కూరాడుకుండ పగిలిన పాత అంచు
గుండెకు ఛిద్రం చేస్తుంది
అనుబంధాన్ని చావగొట్టి
అసహాయంగ చూసే అసమర్థత
పొగచూరిన గోడ కానుకోని
తలకిందులైన పొయ్యి
జీవితాన్ని అడ్డం పెట్టుకొని ఎక్కిరిస్తుంది

బతకవొయ్యి బావుకున్నదేమున్నది
ఒక్కపూట బువ్వకోసం
దేశదేశాలు తిరిగి దేవుకున్నదేమున్నది
ఈత తట్టకు బదులు
ఇనుపతట్ట మోసిండు
యిత్తులకు బదులు
పైసలు పూసిండు
ఈడ్సుకపోయిన చేతుల మీద మొయ్యలేక
కన్నతల్లిలాంటి పొలం రైను బెట్టిండు

తిరిగి తిరిగి తిరిగొస్తే మిగిలిందేమున్నది ?
పుచ్చిన చేరెళ్ళ మీద స్వప్నం
తెగిపోయి మొలకు వేలాడే నమ్మకం
మోసపు మెరుపులల్లుకుంటున్న
మొండిగోడల మధ్య
బతికున్నాడు ఇంకా మొండిగా
పాలోల్ల నాకిండ్లన్నీ పొక్కిల్లే
వాడంతా వలస పోయినట్టు
ఇండ్లన్నీటికి తాళాలే
ఎంత సంచరించినా
పాతమట్టే నెంత రాసుకున్నా
కంటికిందినల్లటిమచ్చలు పోవు



గుర్తుపట్టే ఒక్క ముసలవ్వకు కండ్లు కన్పించయి
ఊల్లె ఉండనియ్యరు
బయట బత్కనియ్యరు
ఇల్లిడిసి ఊరిడిసి భూమిడిసి బతకవోతే
బతుకంతా మసకబారుతనే వున్నది

కూలిన గోడల కింద
ఏం దేవులాడితే ఏముంది
ఎగేసుకొచ్చే ఏడుపు తప్ప –
తొక్కులాటలో గట్టివడ్డ గడ్డిపోచలు తప్ప
ఎవలూకుంచుతరు

మొండితుమ్మల్ల
కూలినగోడల కింద కూలబడ్డ
అతన్ని గుర్తించిందెవరు ?
నిద్రపట్టని కవి !
పాలుపడని పచ్చిబాలెంత తెలంగాణాపల్లెను చూస్తూ
ఎంతకూ నిద్రపట్టని కవి !

8-10-1999

## మంజీర కవుల గురించి మరికొంత...

**అలాజిపూర్ కిషన్** : 'వడిసెల' (1996) కవితా సంపుటి ప్రచురించాడు. మంజీర రచయితల సంఘం అధ్యక్షుడు. టైలరింగ్‌తో జీవనం.
**చిరునామా:** 1-3-65, గురజాడ వీధి, పారుపల్లి, సిద్ధిపేట-502 103.

**దేశపతి శ్రీనివాస్** : కవితా రచనతో పాటు పాటలు పాడతాడు. మంజీరా రచయితల సంఘం మెదక్‌శాఖ అధ్యక్షుడు. తెలుగు ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా:** 6-1-84/ఎ, కూరగాయల మార్కెట్ సిద్ధిపేట-502 103.

**ఏలేశ్వర నాగభూషణాచార్య** : 'నేల తడవని వాన' (1992) కవితా సంపుటి ప్రచురించాడు. మంజీరా రచయితల సంఘం, మెదక్‌శాఖ అధ్యక్షుడు. తెలుగు ఉపాధ్యాయుడిగా ఉద్యోం.
**చిరునామా** : పెద్దబజార్, మెదక్ - 502 110.

**దాసరాజు రామారావు** : 'గోరుకొయ్యలు' (2001) కవితా సంపుటి ప్రచురించాడు. మంజీరా రచయితల సంఘం గజ్వేల్ శాఖ అధ్యక్షుడు. ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా** : 5-44, డిగ్రీ కాలేజి వెనుక, గజ్వేల్ - 502 278.

**పప్పుల రాజిరెడ్డి** : 'వరదగూడు' కవితా సంపుటి (1996) ప్రచురించాడు. మంజీరా రచయితల సంఘం, దుబ్బాక శాఖ అధ్యక్షుడు. ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా:** మోతే (పిఒ), మిరుదొడ్డి (మం), మెదక్ జిల్లా-502 102.

**ఐలేని గిరి** : 'నెమలి కన్ను' కవితా సంపుటి (1996) ప్రచురించాడు. మంజీరా రచయితల సంఘం, దుబ్బాక శాఖ కార్యదర్శి. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఉద్యోగం.
**చిరునామా** : స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, సిద్ధిపేట - 502 103.

**కందుకూరి శ్రీరాములు** : 'వయొలిన్ రాగమో వసంత మేఘమో' (1993), 'సందర్భం' (2001) కవితా సంపుటాలు ప్రచురించాడు. తెలుగు ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా:**16-11-1/5/9/1, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్-36.



**మహమూద్ పాషా** : 'ఉనికి' కవితా సంపుటి (1986) ప్రచురించాడు. ఫైర్ స్టేషన్‌లో ఫైర్‌మెన్ ఉద్యోగం.
**చిరునామా** : ఫైర్ స్టేషన్, మెదక్ - 502 110.

**నందిని సిధారెడ్డి** : 'భూమి స్వప్నం' (1987), 'సంభాషణ' (1991), 'ప్రాణహిత' (1995), 'ఒక బాధగాదు' (2001) కవితా సంపుటాలు ప్రచురించాడు. లెక్చరర్‌గా ఉద్యోగం.
**చిరునామా:** 17-112, తూంబాయి, శ్రీనగర్‌కాలనీ, సిద్ధిపేట-502 103.

**కె. అంజయ్య** : 'గీతాయుధం' కవితా సంపుటి (1981) ప్రచురించాడు. మంజీరా రచయితల సంఘం గౌరవాధ్యక్షుడు. 'ఈనాడు' పత్రికా విలేఖరి.
**చిరునామా:** 'ఈనాడు' ఆఫీసు, బాలాజీటాకీస్ వద్ద, సిద్ధిపేట-502103.

**వేముగంటి మురళి** : కవితా రచన, నిరుద్యోగం సహజీవనం.
**చిరునామా** : రామాలయం, పారుపల్లి వీధి, సిద్ధిపేట - 502 103.

**తైదల అంజయ్య** : కవితా రచన, చిత్రలేఖనం చేస్తాడు. ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా** : నాగసముద్రాల, మం॥ కోహెడ, కరీంనగర్ జిల్లా

**యం.డి. అహ్మద్** : కవితా రచన, ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా** : 1-12-29/20, గాంధీనగర్, మెదక్ - 502 110.

**కె. రంగాచారి** : 'వార్త' విలేఖరిగా జీవనం.
**చిరునామా** : గురజాడ వీధి, పారుపల్లి, సిద్ధిపేట - 502 103.

**మోతుకూరి అశోక్ కుమార్** : 'సంతకం' కవితా సంపుటి (1992) ప్రచురించాడు. ఉపాధ్యాయుడిగా ఉద్యోగం.
**చిరునామా** : 5-5-34/4, వివేకానందకాలనీ, కామారెడ్డి - 503 111.

**పోగుల రాజన్న** : కవితా రచన, కామర్స్ బోధన చేస్తాడు.
**చిరునామా** : గణేశ్‌నగర్, సిద్ధిపేట - 502 103.

